# సాహితీ గవాక్షం

## (సాహిత్య వ్యాసాలు)

డా॥ టి. శ్రీరంగ స్వామి



శ్రీలేఖ సాహితి

ఇ.నం. 5–11–481, విద్యారణ్యపురి,

వరంగల్ – 506 009

Sahithi Gavaksham (Literary Essays)
Dr. T. Sriranga Swamy



Cover Design "BAPU"

Srilekha Publication No. 22

**Price Rs. 30/-**

Copies can be had from :

VISHALANDHRA PUBLISHING HOUSE,
all branches

NAVODAYA BOOK HOUSE,
Kachiguda, Hyderabad

*Printed at :*

SRI SHANTHI OFFSET PRINTERS,
Hanamkonda, Ph: 79541

---

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు వారు
రూ 3,000/-లు ఆర్థిక సహాయము అందించారు

# మనవి

సాహిత్య జిజ్ఞాసతో ఏదైనా కొత్త విషయాన్ని చెప్పాలనే ఆలోచనతో అప్పటికప్పుడు సినవి ఈ వ్యాసాలు. 1990-97 మధ్యకాలంలో రాసినవి. ఇందులో కొన్ని అంటి సస్సులలోను, ఆకాశవాణి, వరంగల్లు కేంద్రం ద్వారాను సమర్పించినవి. కొన్ని ప్రత్యేక ంచికల నిమిత్తం రాసినవి. వరంగల్లుకు సంబంధించిన వ్యాసాలకు వస్తే ఈ ప్రాంత హిత్య చరిత్రను అక్షర బద్ధం చేద్దామనే ప్రయత్నం ఇందులో ప్రబలంగా సాగింది. మకాలీనమైన అంశాలను చెప్పేటప్పుడు అనేకమైన ఇబ్బందులు ఏర్పడుతుంటాయి ంతేకాదు అనేకమైన విమర్శలకు కూడా దోహదపడటానికి అవకాశం కల్పిస్తాయి. ఈ మకాలీన సమస్యలను ఆలోచించేవారు సమతుల్యముతో ఆలోచిస్తారని ఆశిస్తున్నాను. హిత్య చరిత్ర ఎప్పుడూ సమగ్రముకాదు. ఎందుకంటే అది నిరంతర గమనశీలికాబట్ట.

1956లో తెలంగాణా రచయితల సంఘం పక్షాన వచ్చిన "ప్రత్యేక సంచిక", 987లో "వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక", 1990లో ఏకశిలవైతాళికులు" 1995లో సుప్రసన్న గారి సంపాదకత్వములో వెలువడిన "ఏకశిల హిత్య సౌందర్యము"లు వరంగల్లు సాహిత్య చరిత్ర నిర్మాణ దృష్టితో వచ్చినవే. అలాగే ను నా తొలి ప్రయత్నంలో వెలువరించిన ప్రజామిత్ర, జనధర్మలలో రచయితల, ళాకారులపై వ్రాసిన వ్యాసాలు యధాతథంగా వస్తే ఇంకొంత విషయం వెలుగుకు చడానికి అవకాశముంటుంది.

ఈ వ్యాస సంపుటిలో కూర్చిన మూడు వ్యాసాలు వరంగల్లుకు సంబంధించినవే. ఘంటువుకు సంబంధించిన వ్యాసములో నిఘంటుకారులకు (వరంగల్లుకు సంబంధించి) ప్పడము ఈ ఉద్దేశమే. ఈ వ్యాసాలలో ఏమైనా అంశాలు చెప్పలేదని అనుకుంటే అవి ాకు ఆ సమయములో స్ఫురించకపోవడమే.

ఈ వ్యాసాలను ప్రచురించిన ప్రత్యేక సంచికల సంపాదకులకు, ఆకాశవాణి రంగల్లు కేంద్రం వారికి, ఆయా సదస్సుల నిర్వాహకులకు నా కృతజ్ఞతలు.

నేను కోరగానే ఆత్మీయంతో ముఖచిత్రమును అందించిన సుప్రసిద్ధ చిత్రకారులు బాపు" గారికి నా కైమోడ్పులు.

శ్రీలేఖసాహితి 22 సం॥ల ప్రయాణములో ఈ పుస్తకము 22వ గ్రంథము.

నా వ్యాసంగములో తోడ్పడుతున్న నా కుటుంబసభ్యులకు, మిత్రులకు నా కృతజ్ఞతలు. సకాలంలో ముద్రించి ఇచ్చిన శ్రీ నరసింహారెడ్డి, శాంతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ హన్మకొండ వారికి కృతజ్ఞతలు

-టి శ్రీరంగస్వామి

## ఈ సాహితీ గవాక్షంలో ............

సహృదయులు

సాహిత్యరసికుడు

మధురస్నిగ్ధుడు

సౌజన్య మనస్కులు

మహోన్నత నాగరికుడు

నా గురువులు

**ఆచార్య పి. రామయ్య గారికి**

ఆత్మీయంగా

- ఈ ఉపహారము

**-టి. శ్రీరంగస్వామి**

# 1. సాహిత్యంలో ద్విభాష, పలుభాష నిఘంటువులు

సాహిత్యంలో శాస్త్రపరమైన అంశాలు బహు. విమర్శ, ఛందస్సు, అలంకారం, వైయాకరణం, సాహిత్యచరిత్ర మొదలగు అంశాలను గమనించవచ్చును. సాహిత్యం అనగానే కథ, కవిత, వ్యాసం మొదలగునవి ఉపరితలంగా కనిపించినప్పటికిని వాటి వెనుక వ్యాకరణం, మాండలికాలు, శబ్ద ప్రయోగాలు బలంగా ఉంటాయి. రచయిత ప్రయోగించిన శబ్దాలను - శబ్ధార్థాలను తెలుసుకునేందుకు ఉపయోగించే సాహిత్య ప్రక్రియ నిఘంటు శాస్త్రం (Lexicology). ఈ నిఘంటువులు సాధారణంగా జిజ్ఞాసువులకు మాత్రమే పరిమితం అనుకోవలసి వస్తుంది.

తొలి దినాలలో ఫ్రెంచి, ఆంగ్లేయుల పరిపాలనలో ప్రజలకు రవాణా సౌకర్యాలు మెరుగుపడటం, ప్రజలకు ఇతరప్రాంతాల వారితో సంబంధాలు బలిష్టమవుతున్న సమయములో ఆయా స్థానిక భాషలలోని పదాలు అర్థంకాకపోవడం, వాటని తెలుసుకోవడం - మన మాతృభాషలో ఆ పదానికి సరియైన పదాన్ని (Equal word) గుర్తించడం మొదలగు ఇబ్బందులు ఉంటుంటాయి. ఇప్పటికి కూడా మనం ఒక మాండలికము నుండి మరొక మాండలికమునకు వెళ్ళినప్పుడు, లేదా ఒక ప్రాంతమునుండి ఇంకొక ప్రాంతమునకు వెళ్ళినప్పుడు మన అవసరాలకు సరియైన పదాలను గుర్తించడం జరుగుతుంది. అయితే ఈ పదాలను గుర్తించి ఒక క్రమంలో ఆయాపదాలకు ఎదురుగా సరియైన పదాలను (అర్థాలను) ఉంచడంవల్ల శబ్దాలకు అర్థంచెప్పడం జరుగుతున్నది. ఇలావచ్చినవే నిఘంటువులు. 1741లో ఫ్రెంచివారు భారతదేశంలో ప్రభుత్వం ఏర్పరచిన తర్వాత వచ్చినవి.

తెలుగు - ఫ్రెంచి - 12500 పదాలు

ఫ్రెంచి - తెలుగు - 14800 పదాలు

(తెలుగు నిఘంటు వికాసం - వెలగా వెంకటప్పయ్య)

ఈ నిఘంటువులను గురించి C.P. Brown ఇలా వ్రాసారు "This Dictionnaire Telogoo et Francois ............ was written in or about the year 1794 ......... I bought this volume in London for 25 shillings. It is worth legs ........... had it any value, it is completely superseded by Mr. Compbell's Telugu & English Dictionary; in which work it was made use of. The spelling in wretched .............. "

నిఘంటువులలో కూడా కాలానుగుణ్యముగా మార్పురావడంతో పాటుగా అనేక విధాలైనవి కూడా వచ్చాయి. C.P. Brown భారతదేశానికి వచ్చాక కడప ప్రాంతాలలో పర్యటించినప్పుడు, ఆయన అప్పుడు అక్కడ ఉద్యోగంలో ఉండడం మూలాన తను మాట్లాడే భాషకు సమానార్థాలు అయిన పదాలను - వాటిని ఒక క్రమంలో ఏర్పరచి పుస్తక రూపములో నిఘంటువుగాఅందించారు. దీనిని 1844 సిద్ధం చేసి 1852లో ప్రచురించారు. తర్వాతి కాలంలో తనే అనేక పదాలను ఇందులో చేర్చినారు.

C.P. బ్రౌన్ తన నిఘంటువులలో కేవలం సమానార్థకమైన పదాలనే కాకుండా గ్రంథస్థమైన పదాలు - వాడుకలోగల పదాలను కూడా చెప్పడం జరిగింది. అవసరము అయినచోట పూర్వకవుల ప్రయోగాలను ఆధారాలతో సహా చూపెట్టారు. అలాగే వాడుకలో నున్న సామెతలు, జాతీయాలు గూడ చేర్చినారు ఆంగ్లసమానార్థాలు వీటైనన్ని ఎక్కువగా ఇచ్చారు.

అలాగే తదుపరి నిఘంటుకారులు కూడా తమ తమ నిఘంటువులలో ఆ పదాల యొక్క ఉచ్చారణ, వాటి క్రియా విశేషాలు, వ్యవహారంలో వాటిని ఏ విధముగా ఉపయోగిస్తున్నారో విపులంగా చెప్పారు.

భాష జీవన ప్రవాహంలా నిరంతరం మారుతూనే ఉంటుంది. అందుకే నిఘంటువుల నిర్మాణం నిరాఘాటంగా సాగుతూనే ఉండాలి. ఎందుకంటె పాతశబ్దాలు కొన్ని ప్రయోగాలు లేకుండా పోతాయి. అటువంటి వాటిని Archaic - Words గా మూటగట్టి కొత్తశబ్దాలను చేర్చుకుంటాం. ఈ నిఘంటుశాస్త్రం (Lexicology)తో అతి సన్నిహితంగా ముడివడియున్న శాస్త్రాలు భాషాశాస్త్రం(Lingiustic), వ్యాకరణ శాస్త్రం (Grammar) ధ్వన్యనుసారశాస్త్రం (Phonetics), భాషాబోధనలు (Language Methodology) మొదలగునవి. ఇవి లేకుండా స్వతంత్రంగా నిఘంటు రచన దాదాపుగా అసాధ్యం.

ఈ అవసరాలను దృష్టిలో ఉంచుకొని ప్రస్తుతం విశ్వవిద్యాలయాలలోను, కళాశాలల్లో నిఘంటుశాస్త్రంపైన, విజ్ఞాన సర్వస్వాలకు ప్రత్యేక శాఖలను ఏర్పరచి పరిశోధనలకు స్థానం కల్పిస్తున్నారు .

నిఘంటువులు సాధారణంగా ఏకభాషలోనూ, ద్విభాషలలోనూ ప్రధానంగా ఉంటాయి. ఇంగ్లీషు - ఇంగ్లీషు; తెలుగు - తెలుగు; ఆంగ్లము, ఆంగ్లము - తెలుగు; తెలుగు - ఆంగ్లము ఇలా ఉండడము మనకు సర్వసాధారణం.

ఇలా కాకుండా రెండు భాషలకు మించి ఇతర భాషలను కూడా నిఘంటువులలో

పరిచయం చేయడం వలన ఇవి పలు భాషానిఘంటువులుగా మనకు పరిచయం అవుతున్నాయి. ద్విభాషా నిఘంటువులతో పాటుగా బహుభాషా నిఘంటువుల్లో సమానార్థకమైన పదాలను మాత్రం ఎత్తి చూపెట్టడం జరిగింది.

తెలుగు - రష్యన్ ఇందులో ఉచ్చారణతో పాటుగా అర్థం - దానివాడుకను కూడా చెప్పారు.

తెలుగు - తమిళం - ఇందులో ఉచ్చారణను అర్థాన్ని కూడా ఇచ్చారు.

సాంకేతిక పదాలు అందరికి సంబంధించిన విజ్ఞానాన్ని సూచించునవి కాబట్టి అన్ని భాషల వారికి ఒకే పారిభాషిక పదములు ఉపయోగింపబడినచో దేశమునకు ఎంతో మేలు కలుగుతుందనే విషయం గమనించి హిందీ మహారాష్ట్ర విద్వాంసులు మొత్తం భారతదేశమునకు ఉపయోగించే విధముగా సంస్కృత భాషలో - హిందీ సయింటిఫిక్ గ్లొసరీ (Hindi Scientific Glossary); Twentieth Century English, Marathi Dictionarie లు ఆయా భాషల వారికే గాక అందరికి ఉపయోగపడుతున్నవి. సాంకేతిక పదాలను పరిష్కరించుటకు మద్రాసు ప్రభుత్వము వారు Telugu Equivalents of English Terms అను దానిని ప్రచురించి నిఘంటుశాస్త్రానికి చాల మేలు కూర్చినారు.

ఇక్కడొక విషయం దృష్టికి తీసుకరావలసిన అవసరం ఉంది. తెలుగు సాహిత్యములో పదాలకు, ఆ పదాల వాడుకను గురించి విస్తారంగా పరిశీలించి, పరిశోధించి సమన్వయ దృష్టితో నిఘంటుకారులు నిఘంటువులను రూపొందిస్తున్నారు. యాస్కుని నిరుక్తం నుంచీ, అమరసింహుని అమరకోశం నాటినుంచీ ఈ సంప్రదాయం కొనసాగుతూ వస్తున్నది. ఆధునికంగా వస్తున్న మార్పులననుసరించి నిఘంటుకారులు అక్షరక్రమం పద్ధతి (Alphabitically) నిఘంటువులను రూపొందించడం ప్రారంభించారు. అంతే కాకుండా భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడిన తర్వాత ప్రాంతీయ భాషలను విద్యామాధ్యమాలుగా ప్రవేశపెట్టడం వలన భాషలలో మార్పులు, నానారకాలైన కొత్తపదాలు నాగరికతతో పాటుగా వచ్చి చేరడం ప్రారంభం అయినది. దీనవలన జనజీవనములో మార్పుతోపాటుగా, ఆధునిక సమాజ జీవనములో ప్రాంతీయభాషలు ఇతర భాషలను పరిశీలనాదృక్పథముతో (comparative sight) తో పరిశీలించడం ప్రారంభమైనది. నిఘంటు కారులు తమ మాతృభాష (mother language) తో పాటుగా, మరియొక భాషతోగల గాఢ అనుబంధము దృష్ట్యా నిఘంటువులను రూపొందించినారు. ఈ విధంగా వచ్చిన కొన్ని నిఘంటువులను

తెలుసుకునేందుకు వాటిని విస్మరిస్తున్న సమయంలో మళ్ళీ ఒకసారి మననం చేసుకొవడం ఈ వ్యాసం ఉద్దేశం.

వరంగల్లు ప్రాంతంలోని ఈ క్రింది రచయితలు వెలువరించిన నిఘంటువులు అందరికీ తెలియవు. వారికి తగిన ప్రోత్సాహం అందకపోవడం ఒక కారణం అయితే ఆయా రచయితల నిర్లిప్తత కూడా ఒక కారణం కావచ్చునేమో. తెలంగాణా ప్రాంతంలో చాలా రచయితలు పబ్లిసిటీకి, తమకి తాముగా బయటకు చెప్పుకోవడమునకు సుముఖతను చూపెట్టకపోవడము వలన వారు తమ తమ స్థాయిలలోనే ఉండిపోయినారు. వాటి గురించి జాగ్రత్తపడవలసిన అవసరం ఎంతైనా ఉంది. వరంగల్లు ప్రాంతం నుండి వచ్చిన నిఘంటువులు ఇవి.

1. ఉర్దూ - తెలుగు నిఘంటువు - అయితంరాజు కొండలరావు వరంగల్లు (1938) వెంకట్రామ అండ్ కో, హైద్రాబాదు.
2. ఉర్దూ - తెలుగు నిఘంటువు - బిరుదురాజు రామరాజు (1952) అంజుమన్ తరక్కీ - ఉర్దూ
3. తెలుగు - హిందుస్థానీ నిఘంటువు - అయితంరాజు కొండలరావు (1954) వెంకట్రామా అండ్ కో, సికింద్రాబాద్
4. వేదాంత తత్వార్థ దర్పణం అను వేదాంత నిఘంటువు - వృక్షాల జగన్నాథం (1968) హన్మకొండ.
5. ఆంధ్రపదనిదానము - తూము రామదాసు - శేషాద్రి రమణ కవుల సటీక - కాకతీయ గ్రంథమాల వరంగల్లు (1930)
6. ఓరుగల్లు పదజాలము - మామిడిపూడి వెంకటాచార్యులు కావచ్చునని బ్రౌన్ ఊహ అముద్రితం.
7. ఆరె - తెలుగు నిఘంటువు - కుసుంబ లింగయ్య, రేపల్లె, నర్సంపేట, 1979
8. కోయభాషా నిఘంటువు - ఇవి కరపత్రాలలా వచ్చినవి ఐ.టి.డి.ఎ. వారి ఆధ్వర్యంలో
9. సుగాలీల పదకోశము - ఇవి కరపత్రాలలా వచ్చినవి ఐ.టి.డి.ఎ. వారి ఆధ్వర్యంలో
10. తెలుగులో ఛందఃపదకోశం - కోవెల సంపత్కుమారాచార్యులు (1970)
11. నానార్థ పదనిక్షేపం (1990) - పల్లా రామకోటార్య (అ నుండి మ అక్షరము)

క్రమసంఖ్య 6, 7, 8లలో సరియైన భాషకాని, అక్షరాలు లేవు. ఆయా రచయితలు కేవలం ధ్వనిని అనుసరించి, పలుకుటను అనుసరించి ఆయాపదాలను తెలుగులో వ్రాసి వాటికి అర్థాలను అందించారు. దానిని ఎవరైనా ముందుకు తీసుకొని వస్తే ఈ భాషలపై సమగ్ర నిఘంటువులు రావడానికి అవకాశం ఉంటుంది.

ఇది ఇట్లా ఉంచితే - తమకున్న భాషాభినివేశమునకు తోడు ఇతర భాషలలో కల ప్రావీణ్యముతో ఆయా భాషలలోకి అర్థాలను చెప్పడం ప్రారంభించడం వలననూ, వారి వారి బహుభాషాకోవిదత్వం వలన పలుభాషా నిఘంటువులు రూపొందించడము జరిగినవి. దీని వలన ఒక భాషతో పాటుగా రెండు మూడు భాషలలో పరిచయం ఉన్న వారికి సరియైన సమానార్థకమైన పదాన్ని సులభంగా తెలుసుకోవడానికి అవకాశం ఏర్పడుతుండి. ఈ ఒరవడిలో వచ్చిన పలుభాషా నిఘంటువుల పేర్లను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

1. తెలుగు - ఇంగ్లీష్ - హిందీ త్రిభాషాడికనరి - శ్రీ యం. హనుమంతరావు మరి ఇద్దరు, స్వస్తిక్ పబ్లిషర్స్, రాజమండ్రి.
2. త్రిభాషామంజరి లేక సేజువాణి - ఇది తెలుగు, హింది, పార్సి భాషలకు సంబంధించినది - ఈమని సీతారామస్వామి - 1890 శ్రీ ధామప్రెస్, మచిలీపట్నం.
3. నాలుగు భాషల నిఘంటువు - తెలుగు, హిందుస్తానీ, ఇంగ్లీషు, తమిళ భాషలకు సంబంధించినవి. దాసరి లక్ష్మణస్వామి (1924) కాకినాడ.
4. దక్షిణ భాషా నిఘంటువు - ఆంగ్ల, తెలుగు, తమిళం, మళయాళం, కన్నడ భాషలకు సంబంధించినది దక్షిణభాషా పుస్తకసంస్థ - మద్రాసు
5. భారతీయ వ్యవహారకోష్ 1961 - 16 భారతీయ భాషలు ఇందులో ఉన్నవి. విశ్వనాథ దినకర్ నవవాణె త్రివేణీ సంఘం, పూనా
6. ఇంగ్లీషు, తెలుగు ఒరియా వొకాబ్యులర్ (1903)- రంగుభట్ల గున్నయ్య శాస్త్రి, బెర్హంపూర్
7. తమిళం, తెలుగు, ఇంగ్లీషు వొకాబులర్ (1874)- బహుజనపల్లి సీతారామాచార్యులు, మద్రాసు
8. తెలుగు, తమిళం, హిందూస్థానీ ఒకాబులర్ (1883)

9. తెలుగు, తమిళం, ఇంగ్లీషు, హిందుస్థాని ఒకాబులర్ (1891)- బెంగళూర్.

10. పంచకషాయ ఒకాబులర్ (1887)- బి. రాజగోపాలశ్రేష్ఠి బళ్ళారి, తెలుగు, కన్నడం, తమిళం, ఇంగ్లీష్ హిందుస్థాని భాషలు

11. పాషిఫా ఒకాబ్యులరీ (1884) - మద్రాసు, తమిళం, తెలుగు ఇంగ్లీషు, హిందుస్థాని భాషలు.

12. షట్ భాషాచంద్రిక - వివరాలు సరిగా లేవు

13. షట్ భాషా మంజరి (1937) - వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ మద్రాసు తెలుగు, తమిళం, కన్నడం మళయాళం, హిందీ, ఇంగ్లీషు భాషలు

14. శబ్దార్థ చంద్రిక - యం. మొదలియార్, మద్రాసు తెలుగు, కన్నడం తమిళం, ఇంగ్లీష్, హిందుస్థాని, మరాఠీ భాషలు

15. గ్లాసరీ ఆఫ్ జ్యుడిషియల్ అండ్ రెవెన్యూటర్మ్స్ (1855) విల్సన్ లండన్. పర్షియన్, హిందీ, సంస్కృతం, బెంగాల్, ఒరియా, మరాఠీ, గుజరాతి, తమిళం, తెలుగు, కన్నడం, మళయాళ భాషలు

16. గ్లాసరీ ఆఫ్ లా టర్మ్స్ 1931 - ప్రభుత్వ ముద్రణాలయం - మద్రాసు

17. వైద్యశారీరశబ్దకోశం (1969)- వేటూరి శంకరశాస్త్రి ముదిగొండ గోపాలరావు, విజయవాడ, ఇంగ్లీష్, సంస్కృతం, తెలుగు భాషలు

18. పండిత నిఘంటువు 1913 - వి.డి. పండిత, బెంగళూర్ -కన్నడం, హింది, మరాఠి, గుజరాతి, తెలుగు, తమిళ భాషలు

19. వైదిక శబ్దసింధు (1894&1914) - ఉమేష్ చంద్రగుప్త - కలకత్తా - లాటిన్, సంస్కృతం, హింది, తెలుగు, బెంగాలీ భాషలు

ప్రస్తుతం లభ్యపడుతున్న నిఘంటువులు ఇక్కడ పేర్కొనకపోవడం వలన ఈ వ్యాసం అసంతృప్తిగా ఉంటుంది. అన్నిటిని కూడా చెప్పడం సాధ్యం కాదు. ఇందులో బహుళ ప్రచారంలో నున్న వాటిని గురించి చెప్పడం ఔచిత్యం.

1. శబ్ద రత్నాకరము - బహుజనపల్లి సీతారామాచార్యులు - చిన్నయసూరి

శబ్దముల రూపనిర్ణయమును ఇందులో శాస్త్ర సమ్మతంగా చెప్పారు. కొన్ని పదాలకు ప్రమాణ వాక్యాలను కూడా ఇందులో కూర్చారు. ప్రస్తుతము వాడుకలోనున్న ప్రమాణం అయిన నిఘంటువు.

2. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - జయంతి రామయ్య పంతులు (1934)

ఇది తెలుగు నిఘంటువు ఇందులో తెలుగు పదానికి అర్థ వివరణతో పాటుగా వాటిని వాడుకొనిన విధము చెప్పడం ఆయా భాగఖండికలను కూడా ఇందులో పొందుపరిచారు. ఇందువలన ఆపదమును ఎలా వాడుకోవచ్చో కూడా చెప్పినట్టు జరిగింది ఇందులో గ్రామ్యములను వదిలివేసారు.

3. శబ్దార్థ చంద్రిక - మహాకాళి సుబ్బారాయుడు

4. సి.పి. బ్రౌన్ తెలుగు - ఇంగ్లీష్ డిక్షనరి

5. సి.పి. బ్రౌన్ ఇంగ్లీష్ - తెలుగు డిక్షనరి

6. విద్యార్థి కల్పతరువు - ముసునూరి వేంకటశాస్త్రి ఇందులో పారిభాషక పదాలు, పర్యాయపదాలు, నానార్థాలు రసప్రకరణం మొదలుగా 25 ప్రకరణాలున్నాయి.

7. సంస్కృతాంధ్ర నిఘంటువు (1893-1993 మరియు 95) - పెత్యా వెంకటశేషయ్య ఇది తెలుగు లిపిలో సంస్కృత పదాలకు తెలుగులో అర్థాలను అందిస్తుంది.

8. ఎమెస్కో పాకెట్ తెలుగు - ఇంగ్లీషు డిక్షనరి 1977 - శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు 7500 పదాలు

9. ఎమెస్కో పాకెట్ ఇంగ్లీష్ - తెలుగు డిక్షనరి - జి. యన్. రెడ్డి 1995 తెలుగు అకాడమీ హైద్రాబాద్.

జనసామాన్యానికి అందుబాటులోను కేవలం అర్థాలను అందించే విధముగా లిఫ్కో డిక్షనరీ, స్వస్తిక్ పబ్లికేషన్స్ రాజమండ్రి వారి ద్విభాషా, త్రిభాషా నిఘంటువులు, ఇతర అనేక నిఘంటువులు వస్తూనే ఉన్నాయి.

ఈ నిఘంటువులతో పాటుగా ఈ క్రింది వాటిని కూడా మనం నిఘంటువులలో భాగంగా పరిగణించవలసి ఉంటుంది. ఇవి పర్యాయపదనిఘంటువులు ( విజ్ఞాన సర్వస్వాలు)

1. తెలుగు పర్యాయపదనిఘంటువు 1990 - జి. యన్. రెడ్డి 4336 పదాలకు

పర్యాయపదాలను సూచిస్తూ 54,500 ఆరోపాలు ఇందులో ఉన్నాయి సమానార్థకపదాలను ఎంపికచేయుటకు ఇది బాగా ఉపయోగపడుతున్నది.

2. పదబంధ పారిజాతము 1961 - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైద్రాబాద్

ఇది ఒక విశిష్టమైన గ్రంధము ఇది పునర్ముద్రణ కావలసిన అవసరం ఎంతైనా ఉంది.

3. పారిభాషిక నిఘంటువు (1934మరియు 1988) డి.వి. శివరావు (వ్యవహారకోశము, శాస్త్ర పరిభాష కలసిన సంపుటము)

ఇది పర్యాయ పదములకు, వ్యవహారమునకు సంబంధించిన పదాలకు, సాంకేతిక పదాలకు సమానార్థముగు పదాలను కూడా విప్పిచెప్పింది.

4. గ్లాసరీ ఆఫ్ తెలుగు అడ్మినిస్ట్రేటివ్ వర్డ్స్ (ఇంగ్లీషు, తెలుగు) - తెలుగు అకాడమి, హైద్రాబాద్

తెలుగు అధికార భాషను దృష్టిలో ఉంచుకొని ప్రచురించినది.

5. పూర్వగాథాలహరి (1952) - వేమూరి శ్రీనివాసరావు.

అష్టాదశపురాణములందలి పూర్వగాధలకు సంబంధించిన ప్రతివ్యక్తి , ప్రతి విషయముల వివరములను తెలిపెడి ఆంధ్రనిఘంటువు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పరిపాలనా భాష తెలుగుగా అమలుపరిచే నిమిత్తం 58 ప్రభుత్వ శాఖలలో ఆయా శాఖలకు సంబంధించిన పదకోశాలను ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం, హైద్రాబాదు తరపున ప్రచురించింది. ఆంగ్లంలోనున్న పదాలకు సమానార్థకమైన తెలుగు పదాలను ఇందులో చెప్పారు.

ఇవికాక పలుభాషా నిఘంటువులు అక్కడక్కడ ఉన్నప్పటికిని వాటి సరియైన వివరాలు లభ్యపడకపోవడం వలన ఇక్కడ వాటిని ఉటంకించలేదు. అలాగే తెలుగుతో సంబంధం లేని వాటిని వదిలివేయడం జరిగింది.

ద్విభాషా నిఘంటువులలో బహుళ ప్రచారంలో నున్న వాటినీ, ప్రస్తుతం లభ్యపడుతున్న వాటిని ఇక్కడ వదిలి వేయడం జరిగింది.

పలు భాషా నిఘంటువులు, ద్విభాషానిఘంటువులను నిఘంటుశాస్త్రం

పాఠ్యాంశముగా ఉన్న కళాశాలలోను, విశ్వవిద్యాలయాలలో ప్రత్యేకంగా సేకరించి ఉంచినచో పరిశోధకులకు, వాటిని గురించి ఆలోచించే జిజ్ఞాసువులకు ఉపయోగం ఉంటుంది.

## ఉపయుక్త గ్రంథాలు

1. మన కవులు, పండితులు, రచయితలు (1970) - కోవెల సంపత్కుమారాచార్యులు
2. తెలుగు నిఘంటు వికాసం (1975) - వెలగా వెంకటప్పయ్య ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైద్రాబాద్
3. వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక (1987) - టి. శ్రీరంగస్వామి
4. ఇంగ్లీష్ - తెలుగు పారిభాషక నిఘంటువు (1933 మరియు 88) - డి.వి. శివరావు

# 2. పాల్కురికి సోమనాథుడు "అనుభవసారము"

దీనిని "అర కానికి కూడా కొనడు" అని అంటుంటారు. అలాగే "రెంటికి జెడిన రేవడి" మొదలగు సామెతలు మనకు బహుగా వినబడుతుంటాయి. ఈ సామెతలకు వాడుకలో నున్న వాటిని యధాతథంగా జానుతెనుగులో చెప్పుతానన్నట్టుగా, తన కవిత్వములో మొట్టమొదటగా వినిపించిన వాడు పాల్కురికి సోమనాథుడు. ఈయన తన కాలములో అంతవరకు ఎవరూ చెప్పడానికి సాహసించని విధముగా తన కవిత్వములో రంగరించి అద్దినాడు. ప్రజల మనస్సులకు హత్తుకునే విధముగాను, సామాన్యులకు ఏది అందిస్తే వారికి బాగుంటుందో దానిని తీసుకొని కవిత్వం చెప్పినాడు. ఇందు వలన సమకాలీన పండితులు ఈసడించుకొన్నప్పటికిని ఆయన వాటిని ఏమాత్రం పట్టించుకొనలేదు. అంతేకాదు ఆయన కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుని చూచి శత్రువులజయించి, అగ్రహారములను సంపాదించి "ద్విపద" ను చాటి చెప్పిన ఘనుడు, మహానుభావుడు. "ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ట రచనమానుగా సర్వసామాన్య యుగానికి జానుదెనుగు విశేష ప్రసన్నతకు, నట్టులుగాక కావ్య ప్రౌఢిపేర్మి - బెట్టున రచియింపనేర్చిన జాలు, నుపమింపగద్య పద్యోదాత్త కృతులు ద్విపదంబ సమయ" అని ఆ కాలములో నున్న "ఊహను, అభిప్రాయాన్ని సంస్కరించిన వాడు పాల్కురికి సోమనాథుడు.

సమకాలికుల అభిప్రాయమునకు ఎదురీదినాడు. పద్యములకన్న "ద్విపద" పాటగా పాడుటకు అనుకూలమైనదిగా భావించి, అందులోనే రచనచేసి ప్రచారంగావించిన వాడు, సోమన - వీరశైవమతోద్రేకసంపూరితుడు, వైలక్షణ్యమున్న వాడు, స్వతంత్రభావాలు పుష్కలంగా కలిగినవాడు.

పాల్కురికి సోమనాథుడు తన కవిత్వములో సమకాలీన సమాజములోని విశేషాలను, వాస్తవపరిస్థితులను యధాతథముగా చిత్రించినాడని చెప్పవచ్చును. ఆనాటి సాంఘిక జీవనములో జరుగుతున్నటువంటి చౌర్యాలను, ద్యూత్యాలను, విటులకు సంబంధించిన వివిధ విషయాలను వర్ణించడమే కాకుండా - చండాల, యాదవ ప్రముఖ జాతి విశేషాలను వర్ణించిన విధానమును పరిశీలిస్తే సోమన ప్రతిభ తెలుస్తుంది.

సోమన రచించిన కృతులలో మొదటి రచన "అనుభవసారము" ఈయన పద్యకృతులు నాలుగు అవి -

అనుభవసారము
వృషాధిపశతకము
చతుర్వేదసారము
చెన్నమల్లుసీసములు

ఇక్కడ అనుభవసారము గురించి మాత్రమే ప్రస్తావించదలచుకున్నాను. ఈలఘుకృతి వృత్తరచనా వైవిధ్యము గలది. ఇందులో మొత్తము 243 పద్యాలున్నవి. ఈ పద్యకృతి "శ్రీ"తో ప్రారంభించి "మంగళమహాశ్రీ"తో ముగుస్తుంది. దీనిని పాల్కురికి సోమనాథుడు "గోడగినారయ్య" అను భక్తునకు అంకితమిచ్చినాడు.

"గోడగమగు సంసారము
గోడగమని తెలుపఁబూని గోపతియెదురన్
గోడగ మాడెడి కతమున
గోడగి నారయ్య నాఁగఁగొఱలు ధరిత్రిన్" (పద్యం : 18)

త్రిపురారి భక్తి యుక్తుడు
త్రిపురారి మహిష్ఠ నామధేయుడు సాక్షా
త్రిపురారి మూర్తి గోడగి
త్రిపురారి మదీయ సత్కృతికి నొడయఁడుగాన్ (పద్య : 25)

మత విషయముకన్న సాహిత్య విషయములో ప్రాచీనాంధ్ర, వాఙ్మయములో ఒక, విశిష్టకృతిగా "అనుభవసారము" ప్రసిద్ధికెక్కినది.

ఈ రచనలోని రచనావిధానమును అనుసరించి, అతడు వృత్తరచన యందు అందెవేసిన చేయియని, తిక్కన శ్రీనాథుడు మొదలగు మహాకవులకు గూడ ఆ విషయమున మార్గదర్శకుడు అయినాడని స్పష్టముగా నిరూపించుచున్నది. త్రిభంగి, క్రౌంచపదము, వనమయూరము, మాలిని, మానిని, తరువోజవృత్తములు ఈ రచన యందు ప్రయోగించినారు. సోమన ప్రయోగించిన "త్రిభంగి" వృత్తము లాక్షిణికులకు, ఈనాటికి కూడా ప్రామాణికముగా నిలిచినది. ఈ గ్రంథము చివరలో రెండు తరువోజలున్నవి. ఇందులో చతుర్విధకందాలు, కందాలలో ద్వంద్వ ప్రాసలు, త్రిపాసలు గలవి కూడా ఈ అనుభవసారములో నున్నవి. ఈ అనుభవసారములోని పద్యాలను గమనించినప్పుడు 163 కంద పద్యాలు, మహాస్రగ్ధర, త్రిభంగి, క్రౌంచపదము, మాలిని, వనమయూరము, మానిని, సర్వతఃప్రాస సీసము అను వృత్తాలు ఒక్కొక్కటి, తరువోజలు మాత్రం రెండున్నవి.

సోమనాథుడు కందాలుచెప్పినా, వృత్తాలు చెప్పినా, ద్విపదలు అందించినా దేశి కవిత్వోద్యమ లక్ష్యం అనుకరించడం కూడా ముఖ్యంగా ఆయన నిర్ణయించుకున్న శైవమత ప్రచారం, శైవమతాన్ని వ్యాపింపచేయడం.

పాల్కురికి సోమనాథుడు పరమశివుని ప్రమథగణాలలో ఒకటైన "భృంగిటి" యొక్క అవతారం అని శైవుల విశ్వాసం. అతడు పరమేశ్వరుని ఆదేశం ప్రకారం శివభక్తిని ప్రచారం చేయడమే. అందువలన ఇప్పటికిని పాల్కురికి (ప్రస్తుతం పాలకుర్తి - వరంగల్లు జిల్లా) నందు ఇతనిని అవతారపురుషుడుగాను, ఒక ప్రవక్తగాను భావిస్తారు. శివుని ఆదేశం

ప్రకారం సోమన బసవపురాణాన్ని సకల భక్తుల గాథలను కథాగుచ్ఛముగా రచించారు. ఈ విషయాన్నే సోమనాథుడు అనుభవసారములోని పద్యాలు బలపరుస్తున్నవి. అనుభవసాదము వలన సోమన గురువులు వీరు అని తెలుస్తున్నది.

దీక్షా గురువు - గురులింగార్యుడు
వేగురువు - వేమనారాధ్యుడు
కవిత్వగురువు - కరస్థలము విశ్వనాథుడు

అనుభవసారము వీరశైవమతము యొక్క లక్ష్యములను, లక్షణాలను వివరిస్తున్నది. ఇందులో శైవము, శివలింగము, లింగధామము, వీరశైవము, జీవయాత్ర, సాధనసాధ్యములను సూక్ష్మవిషయాలు. గురుమహిమ, భక్తిస్వరూపము, భక్తుల లక్షణము, భక్తి మహిమ, భావక్రియార్చనా విధానము, లింగార్చనా విధి మొదలగు షట్ స్థల స్వరూపము అను స్థూల విషయాలతో సమన్వయము చేయబడి వీరశైవతత్త్వము నిరూపింపబడినది.

జ్ఞానికి శాంతంబును నవ
ధానికి లింగార్పితముల తాత్పర్యంబున్
దానికి నుచితంబును నభి
మానికి నడుగమియు నొప్పు మహిత గుణాఢ్యా ! (పద్యం : 73)

గురుభక్తి గురించి ఇందులో సుమారు రెండుపదుల పద్యాలను చెప్పినారు. గురువులేక శిష్యుని ఉనికిగాని, గమనము కాని ఉండదంటారు.

"గురుభక్తి దళి సంస్కృతి
గురుభక్తి సమస్తరోగ కులగిరిపతియు
గురు భక్తి భక్త హేతువు
గురు భక్తియె సహజముక్తి గురుభక్తి నిధీ (పద్యం 42)

సమాజములోని అస్తవ్యస్త పరిస్థితుల మీద, వ్యక్తిత్వంపై ఆయన చురకలు బాగావిసిరాడు. ఆ చురకలు జాగృతం చేసే విధముగా ఉన్నవి అనటంలో ఏమాత్రం అతిశయోక్తి ఉండదు. ఈయన కవిత్వంలో సుమతికారుడు లాంటి కవుల కవిత్వం తళుక్కునమెరుస్తుంది. బద్దెనముందా! సోమన ముందా! అనే మీమాంస ఇక్కడ అనవసరం. కవితాఛాయలను చూసినప్పుడు వేమన కూడా మన మనస్సుల్లో ఒకసారి కదలాడుతాడు.

సోమనాథుని "అనుభవసారము"ను జాగ్రత్తగా పరిశీలించినచో ఇంకొక ప్రత్యేకాంశమునుకూడ గమనించగలము. పాల్కురికి తనకు ముందున్న కవులను కూడా

అనుసరించినట్టుగా భావించవచ్చును. నన్నయ్య ఆంధ్ర మహాభారతము ఆదిపర్వము - ప్రథమాశ్వాసము (103-106 పద్యసంఖ్య)లోని 5 పద్యాలు శతకలక్షణాలకు మార్గదర్శకం అని చెప్పుకున్నట్టుగానే, నన్నెచోడుడు రచించిన "కుమార సంభవము" లోని దశమా శ్వాసము నందలి పది పద్యాలు (90-99 వరకు) పేర్కొన్నట్టుగానే శ్రీసోమనాథుడి పద్యాలు కూడా శతక లక్షణానికి దగ్గరగానున్నవని నిర్మోహంగా చెప్పవచ్చును. ఆయన తన పద్యాలకు ఈమకుటములను వాడుకొన్నాడు.

1. గురుభక్తియె సహజముక్తి గురుభక్తి నిధీ ! - 3 పద్యాలు (పద్యసంఖ్య 41-43)

2. గురుపాతకమండు బుధులు గురుభక్తినిధీ ! - 7 పద్యాలు (పద్యసంఖ్య 44-50)

3. త్రిపురారీ ! - 16 పద్యాలు (కొన్ని మూడు పద్యాలు కొన్ని రెండు పద్యాలుగా అక్కడక్కడ ఉన్నవి)

4. మహాత్మా ! - ఇవి రెండు పద్యాలలో అక్కడక్కడ ఉన్నవి.

ఇక సోమనాథుడు మాత్రమే చెప్పిన విలక్షణం అయిన పద్యము "త్రిభంగి"ని ఒకసారి పరికించండి.

"గురుమత సహితులు, దురత విరహితులు
సురు చిరసజ్జన వర్తుల్, ధృవకీర్తుల్, శాంత సుమూర్తుల్
పరిహృతవికృతులు, నిరవధి సుకృతులు
మరణ పునర్భవదూరుల్, సువిచారుల్, భక్తివిచారుల్
పరవశ హృదయులు; నిరుపమసదయులు
పరసమయప్రవిఘాలుర్, గుణశాలుర్, దానసుశీలుర్
పరహిత చరితులు, వరగుణభరితులు
పరమపరాత్యనుషక్తుల్, శివభక్తుల్, శాంతనియుక్తుల్" పద్య - 194

ఈ "త్రిభంగి" వృత్తమును గురించి అప్పకవీయమునందు ఇలా చెప్పినాడు.
"విసువకసుకవులు రస ప్రతి పదమున హస గగ మూఁడొక !
తీరై మఱివైఖె మూఁడొక తీరై॥

ప్రతిపాదమునకు 34 అక్షరములను, 42 మాత్రలు ఉంటాయని, అన్ని పాదములందును పూర్వార్థమున ప్రాసయతియును, ఉత్తరార్థమ్మున అంత్యప్రాస నియమమును కలవు.

అయితే కవిజనాశ్రయమున మాత్రము పాదమునకు 28 అక్షరాలు, 36 మాత్రలను చెప్పినాడు. ఇది ఒకానొక ఉద్ధురమాలా వృత్తము 4 నగణములు + 2 సగణములు + భ + మ + న + గ అను గణక్రమముండును.

మతతత్త్వం. ధర్మసూక్తులు ఈయన కవిత్వం ద్వారా ప్రచారంలోకి వచ్చాయి. ప్రజాగళాలలో నిలిచిపోయాయి. జీవనమౌలికతను, వ్యాపకతను చాటి చెప్పినవి. సామాజిక ప్రగతికి దోహదంచేసినవి. నిద్రిస్తున్న మానవుడిని జాగరూకత చేసింది "అనుభవసారము".

తనమదిఁ బుట్టిన కోపము
తనుఁ జెఱుపునె యెదిరివారిఁ దాఁ జెఱుపునె పు
ట్టిన యిల్లుండఁగ ననలము
మును చెఱుచునె యితర సదనములఁ ద్రిపురారీ ! (పద్యం : 125)

సోమనాథుడు తను నమ్మిన అంశాన్ని చాటిచెప్పగలిగిన మేరునగధీరుడు. నిర్మోహమాటి. ధన్యజీవి.

(నవంబరు 94లో తిరువణ్ణామలైలో ప్రసంగించిన వ్యాసం)

# 3. పాల్కురికి సోమనాథుడు - వీరశైవమతము

"నాసేవించు శివుండు కాని శివుఁడున్నడొక్కఁ డచ్చంపుఁ దే
జై సంవ్యాప్త జగత్త్రయంబుగను వాఁడల్పీయసుండై సునా
యాసంబొప్ప మహీయసుండను తానాతేజు వ్యాపించఁదే
లా సన్నంబగునట్టి మానిసులయం దానిట్టిండు కన్పింప గన్"
(శ్రీమద్రామాయణ కల్పవృక్షము - యుద్ధ - కుంభకర్ణ - 158)

సాహిత్యంలో అదివరకే ఏర్పడియున్న సాహితీ సంప్రదాయాలను పాటించుచు రసవత్కావ్యముగా, శిల్పమయముగా తన కావ్యమును తీర్చిదిద్దిన వాడెల్లను మహాకవియే. భాషతో, భావనలో, కవితాశిల్పములో, ఛందస్సులో, ప్రక్రియలో, శైలిలో, వస్తువులో సర్వత్ర అతని దగునూతన సృష్టియుండి భావితరములకు మార్గదర్శకమై, అనుసరణయోగ్యమై, ఆకర్షకమై ప్రజామోదమును పొందిననే యాతడు యుగకర్త అవుతాడు. ఈ లక్షణాలతో పరిశీలిస్తే సోమనను  సాహిత్యమునకు, వీరశైవమతమునకు చేసిన సేవలకు అతనిని యుగకర్తగానెన్న వచ్చును.

పాల్కురికి సోమనాథుడు ఒక విశిష్టమైన వ్యక్తి. విలక్షణుడు. తెలుగు సాహితీమూర్తి. ఝుటా ఝూట మకుటంనందు వెలసినవాడు మన పాల్కురికి సోమనాథుడు. ఇతని ప్రతిభ బహుముఖమైనది. పాండిత్యము అపారమయినది. తెలుగుభాషలోనే కాక కన్నడం, సంస్కృతంలోను మహాకవి. సంస్కృతమున భాష్యకారుడుగా, కవిగా, మతోద్ధారకుడుగా దర్శనమిస్తాడు. ఇంతేకాక తమిళ, కన్నడ, మహారాష్ట్ర, మళయాళ భాషా సాహిత్యాలలో నిష్ణాతుడు. సోమన అనుసరించిన అనేక కావ్యసంప్రదాయములు అతనినొక సాహితీ యుగకర్తగా నిర్ధారించుచున్నవి. కావ్యమున ప్రధానములైన కావ్యభాష, కావ్యఛందస్సు, కావ్యవస్తువు, కావ్యనాయకుడు, కావ్యరసము మొదలగు వాటి నిర్వహణయందును సోమన తనదైన స్వతంత్ర మార్గమునే అవలంబించినాడు. అతడు క్రొత్తగా ప్రవేశపెట్టిన సాహిత్యప్రక్రియలు యుగకర్తలలోను సోమన అద్వితీయతను చాటుచున్నవి.

సోమన బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాన నిరతుడేకాదు. బ్రహ్మాండమంత విజ్ఞానమును తనలో రంగరించుకొన్న విజ్ఞానమూర్తి. సోమన పలుభాషలలో అద్వితీయుడు అయినప్పటికిని నూటికి నూరుపాళ్ళు తెలుగుకవి. తొలి తెలుగు కవిగా చెప్పదగినవాడు.

ఓరుగల్లు తొలి తెలుగు కవి పాల్కురికి సోమన బసవపురాణము, పండితారాధ్య చరిత్రలు మహాకావ్యాలే కాదు. ఇవి యదార్థ మహాపురుషుల తొలి జీవిత చరిత్రలు - తొలి చారిత్రక కావ్యాలు తొలి విజ్ఞాన సర్వస్వములు. అంతే కాదు మతమును ప్రాతిపదికగా తీసుకొని జాతీయతను నలుదిశలు వ్యాపింపచేసి, జాతిని మేల్కొల్పిన తొలి వైతాళికుడు. చైతన్య స్వరూపం శివుడని తెలిపి శివతత్త్వమును వివరించిన శివతత్త్వవేత్త. సాహితీ చైతన్యమును ప్రజలగుండెలలో గుప్పించిన వాడు. కుల గోత్రముల కుటిలపు - కృత్రిమపు కంచుగోడలను పగులగొట్టించిన ఉద్యమకారకుడు, ప్రచారకుడు. వీరశైవమతమును ప్రవచించెడు ధర్మమును సాహితీ ధర్మముగా చేసికొనిన సంస్కర్త. చైతన్య విప్లవకారుడు. మహాకవి. తెలుగు సాహిత్యమున పాల్కురికి సోమనాథుడు యుగకర్త .

వీరశైవమతవ్యాప్తికి తన సాహిత్యాన్ని ధారపోసిన వాడు సోమన. సోమనాథుని కాలమును మొట్టమొదటగా గ్రంథస్థం చేసినది సి.పి. బ్రౌన్. ఆయన తన తెలుగు నిఘంటువు పీఠికలో ఈ విధముగా పేర్కొన్నాడు. "B.P - The Basava puranam written in 12700 lines (Dwipada) cuplets by palakuriki Somanath. This probably was written about A.D. 1300" పండితుల చారిత్రకాధారముల ననుసరించి సోమనాథుడు ప్రతాపరుద్రుని కాలము వాడని తెలుస్తున్నది. కాకతీయ సామ్రాజ్యములో ఓరుగల్లుకు 50 కి.మీటర్ల దూరంలోనున్న పాలకుర్తి గ్రామములో శ్రియాదేవి, విష్ణురామిదేవులను వీరశైవ దంపతులకు జన్మించినాడు. ఈ పాలకుర్తి భాగవతకర్త పోతనామాత్యుని గ్రామమైన బమ్మెరకు 3 కి.మీటర్ల దూరములో నున్నది. ఓరుగల్లు ప్రస్తుతం వరంగల్లు. వరంగల్లు ఇలా ఒక విధముగా ప్రత్యేకత కలిగి ఉన్నది. శైవ, వైష్ణవ సంప్రదాయాల సమైక్య భావనకు కలిమిడిగా ఉన్నది. ఈ కలిమిడే నాటికి నేటికి వరంగల్లు జిల్లాలో సహృదయ భావనగా పరిమళిస్తున్నది. ఆ పరిమళ భావనల కూజితమే ఈ కూజితం. వైష్ణవం అయినా, వీరశైవమయినా ప్రజల మనుగడకు, వారి జీవనసరళికి ఎన్నడూ అవి అవరోధాలు కాలేదు.

వీరశైవమతానికి వరంగల్లు జిల్లాకు ఎంతో ప్రత్యేకత ఉంది. ఆ ప్రత్యేకతను మనం ఇక్కడ ఒకసారి స్మరించుకోవడం కూడా సముచితమేనని అనుకుంటున్నాను. సోమన వీరశైవమతంను కట్టకూరు (ప్రస్తుతం కొత్తకొండ కరీంనగరం జిల్లా) సమీపమున గల కటంగూరు గ్రామం కొత్తకొండలో శ్రీ వీరభద్రేశ్వర స్వామి దేవాలయం) నందలి పాలిదేవరయను వీరశైవునిచే నొనరింపబడినది. ఓరుగల్లులోనున్న కొలనుపాకలో ప్రసిద్ధిచెందిన సోమేశ్వరదేవాలయం (ప్రస్తుతం దీనిని జైనదేవాలయంగా భావిస్తున్నారు)లోని సోమేశ్వరలింగము నుండి శ్రీరేవణసిద్ధశివాచార్యుల వారు ఉద్భవించి "కదలీ పురము (బాలేహళ్ళి - చికమగళూరు జిల్లా, కర్నాటక)లో నివసించినారు.

"తథారేవణసిద్ధ స్యకొల్లిపాకే పురోత్తమే
సోమేశలింగ జననమావాసః కదలీపురే ॥

వీరశైవ మతమును శ్రీమజ్జగద్గురు పంచాచార్యులు శివుని ఆజ్ఞానుసారము అతని పంచముఖములనుండి ఉద్భవించి భూలోకములో స్థాపించినాడు. అందులో శ్రీరేవణసిద్ధ శివాచార్యులు ఒకరు.

వీరశైవ మతానికి సంబంధించిన తెలుగు వాఙ్మయం వీరశైవవాఙ్మయం. ఇది గీత సాహితీకవితారీతులలో విస్తరిల్లినది. క్రీ.శ. 12వ శతాబ్ది నుండి 14వ శతాబ్దివరకు వీరశైవమత ప్రాచుర్యం స్పష్టంగా కనిపిస్తున్నది. దీని వలన తెలుగుదేశము శైవక్షేత్రమై ఓంకార రూపాన్ని దాల్చింది. తెలుగుదేశం ప్రణవస్వరూపం. అపూర్వమైన యెనలేని విలువగల ఈ తెలుగు భాషను దాని ప్రాశస్త్యాన్ని గమనించే ఈ దేశాన్ని పాలించిన చాళుక్య రాజులు ఈ భాషను రాజభాషగా ఏర్పరచుకున్నారు. పంచమవేదమైన భారతాన్ని ఈ భాషలో రాయించారు. తర్వాత చోళులు, కాకతీయులు 12వ శతాబ్దిన వర్ధిల్లిన వీరశైవ మతప్రాపుతో తెలుగును అద్భుతంగా వృద్ధిచేశారు. కాకతీయ సామ్రాజ్యం తర్వాత 14వ శతాబ్దం లోవచ్చిన విజయనగర సంగమ వంశీయులు శైవులవడంతో అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరాలు రాజధానులుగా విలసిల్లిన రెడ్డి రాజులు సవైదిక వీరశైవనిష్ఠాగరిష్టులవడంతో 14వ శతాబ్దివరకు తెలుగు సాహిత్యం మీద శైవసాంప్రదాయాలు స్పష్టంగా కన్పించాయి. 12వ శతాబ్దంలో శివకవులు సాహిత్యంలో దేశిమార్గాన్ని సమన్వయించి తెలుగును కూడా సంస్కృతంతో సమానంగా నిలబెట్టారు. శైవవాఙ్మయ మంతా శైవమతవ్యాప్తికి ఉపకరించింది. ఈ వ్యాప్తికి ద్విపద మొదలగు శాఖలుగా విస్తరిల్లిన దేశసాహితీ రూపాలే సాధనాలుగా నిలిచాయి. మార్గకవితలలో ఒక శాఖకు నన్నయ మార్గదర్శకులైనారు. ఉత్తమ సాహిత్యానికి జాతీయత భేదాలు లేవన్నారు వారు. వీరశైవవాఙ్మయం వచ్చినతర్వాతనే పెక్కుమంది కవులు ఉద్భవించారు. అల్పాక్షరాలలో అనల్పార్థం కల్పించిందీ వీరశైవవాఙ్మయం వేదాంత విషయాన్ని అతిసులభంగా అందించిందీ సాహిత్యం.

కన్నడంలో బసవేశ్వరుడు వ్యాపింపచేసిన వీరశైవాన్ని తెలుగు దేశంలో వ్యాపింపచేయగలిగాడు. మల్లికార్జున పండితుడు అవైదికమైన వీరశైవాన్ని సవైదికంగా మార్చి వైదిక కర్మానుసారం గావించాడు. అందువలన అగ్రవర్ణాలవారైన బ్రాహ్మణులు ఈ సంప్రదాయాన్ని అనుసరించి వీరశైవులయ్యారు. అటువంటి వారు ఆరాధ్యులు. అప్పటి నుండి బసవ సంప్రదాయం వారు జంగములు, ఆరాధ్యులు ఈ మతాన్ని పెంపొందించారు. కన్నడ దేశంలో బసవ సంప్రదాయాలను అనుసరించే వారిని లింగాయతులు అంటారు. అయితే పాల్కురికి సోమనాథుడు కన్నడ, ఆంధ్రప్రాంతాలలో ఈ రెండు సంప్రదాయలను విస్తరింపచేశాడు. ఈ రెండు సంప్రదాయాల వాఙ్మయాన్ని ఆధారంగా చేసుకొని వీరశైవ

ప్రవక్తల చరిత్రలు. ప్రాచీన శివభక్తుల చరిత్రలు, శివమత తత్త్వవివరణలు, మతప్రవక్తలస్తుతులను వ్రాసి వీరశైవ వాఙ్మయానికి మూలపురుషుడయ్యాడు. సోమనాథుడు బసవ పురాణం, పండితారాధ్య చరిత్ర, వృషాధిపశతకం, గద్యకృతులు, అష్టకం, ఉదాహరణ రగడలు మొదలగునవి వ్రాసాడు. వీటిని దేశివాఙ్మయంలో వ్రాయడంతో ప్రజలకు కంఠస్థమై, ముఖస్థమై కన్నడ దేశంలో వ్యాపించి కన్నడ సాహిత్య స్వరూపాన్నే మార్చింది. బసవపురాణం కన్నడంలోకి అనువదించబడింది. ఈ వీరశైవ సాహిత్యాన్ని కన్నడిగులకు ప్రసాదించినది తెలుగుకవి సోమనాథుడే, బసవపురాణం కర్ణాటకులను బాగా ఆకర్షించి... భీమకవి అనునతడు దీనిని కన్నడంలోకి అనువదించగా, శంకరాధ్యుడు సంస్కృతంలోకి తీసుకొని వచ్చాడు. తమిళంలోకి అనువదించబడింది. సోమనకు తెలుగు, తమిళం, కన్నడం, సంస్కృతం మరాఠీభాషలతో సన్నిహిత సంబంధమున్నది. ఆయన పద్యాలలో ఈ అన్యభాషా పదాలు మనను పలకరిస్తాయి.

"తిరువడి నా మనంబనగు దే హృదయేశ్వర కింవిధేయతీం
పరతరత్వం పురాణ ననుపాహి విభో అమనాపితా అమా
వరధనెఘళ్ళియంచు నిను బ్రస్తుతి సేయుదు పెక్కు భాషలన్
వరద వివేక శీల ! బసవా ! బసవా ! బసవా ! వృషాధిపా ॥

ఇందులో అయిదు భాషలున్నాయి. సంస్కృతాంధ్ర ద్రావిడములతో కూడిన ఈ పద్యమును కూడా ఒకసారి చూడండి -

"అరుళగిరిప్రసాదముడయానె భవద్గుణ వర్ణసల్పినా
కొరువని నే స్మరామి సురసత్తమ యో గణవర్యయంచు ని
ట్లదురు మణిప్రవాళమున నంనన సేయుదు నిన్ను మన్మనో
వర కరుణావిధేయ । బసవా । బసవా । బసవా । వృషాధిపా ॥

సోమన భాషాద్వయము చే బసవని పాదయుగళమును పూజించినట్లే మూడు బాసల ముచ్చటైన కూర్పులోను ప్రత్యేకత కనబరచాడు. బసవన వాగ్దేవి నానాభాషా వాక్కులతో స్తుతింపదగినవాడు. బసవన అరుళ (అరుణ) గిరీశ్వరుని ప్రసాదము పొందినాడట. అరుళగిరి (తిరువణ్ణామలై) తమిళదేశమందలిది. ఆదేశభాషలో స్తుతించుట అవసరమే కదా! సోమన బసవని చే కన్నడము నందు చేయబడిన దివ్య వర్ణనలు వినెడి భాగ్యము పొందిన వాడు. (భవి.....వర్గసల్పి) కావున అయా భాషల మేలిమికలయికతో

స్తుతించెదనన్నాడు. ఈమశిపువాళవిధానము అయనను త్రిభాషా సమన్వితమైనట్టిది. అదురనియు అట్టి అరుదైన మణి ప్రహళమును త్రివర్ణ బసవ శబ్దములను స్ఫురింపచేయుచు త్రిభాషలచే స్తుతియొనర్చినాడు.

243 పద్యాలతో రచించిన అనుభవసారము (1955 వావిళ్ళ ప్రచురణ) సాహిత్యంలో మొదటి నిర్వచన కావ్యం ఇతనిని రచనలలో బసవ పురాణం, పండితారాధ్యచరిత్రలు ద్విపద కృతులు కావడం వలనను, చతుర్వేదసారము, వృషాధిప శతకాలు, చంపూ కావ్యములుగ తీర్చుట లేకపోయినదన వచ్చును. కాని పద్యములతో కూడిన అనుభవసారము నిర్వచనముగా నుండుట విశేషము. ఈ అనుభవసారము నందుగురువు తత్త్వమును, భక్తుని విధి, లింగని రక్షణా విధానమును, శివానుభవస్థితిని, వర్ణించు సందర్భములలో సోమన ప్రదర్శించిన కవితా శిల్పము ప్రశంసనీయమైనది.

"గురుమంత్రాధః కృతియును
గురునాజ్ఞోల్లం ఘనంబు గురువిముఖతయున్
గురు దంధ్రాన్వేషణమును
గురుపాతక మంద్రు బుధులు గురుభక్తినిధీ (అనుభవసారము - 45 )

సోమనకృతులలో గద్యకృతులు చెప్పుకోదగినవి. అక్షరాంకగద్య, అక్షరాంక పద్యములు, నమస్కారగద్య, పంచకారగద్య, శరణు బసవగద్య, అష్టోత్తర శతనామ గద్య మొదలగునవి. అంతేకాదు సద్గుణరగడ, గంగోత్పత్తి రగడ మొదలగు 30 కృతులను వెలవరించినాడు. ఏ రచన అయినా ఆయన వీరశైవ మతాన్ని ప్రచారం దృష్టిలో ఉంచుకొనడం మూలంగా శివకవులకు యుగకర్తగాను, ఆద్యుడుగాను ఎంచబడినాడు. సోమనకృతులలో ముఖ్యంగాను ప్రబల ప్రచారము లోనున్నవివి -

| | |
|---|---|
| అనుభవసారము | సోమనాధ భాష్యము |
| బసవపురాణము | చతుర్వేద సారము |
| వృషాధిప శతకము | పండితారాధ్య చరిత్రము |
| రుద్ర భాష్యము | |

సోమనాధుని రచనలలో బసవపురాణము పూర్తిగా వీరశైవ సిద్ధాంతములకు ప్రతీక. సోమనాథుడు కేవలం కవియేకాదు. అతడు కవిత్వము మాధ్యమముగా వీరశైవ వ్యాప్తికి కంకణముకట్టుకొన్న అసమాన మేధాశాలి. తన సమకాలములో వ్యాపించిఉన్న బౌద్ధ, జైన,

వైష్ణవాది మతములను, శంకరాచార్యుల అద్వైత వేదాంతము మొదలైన సిద్ధాంతములను ప్రతిఘటించి వాటిని త్రోసిరాజని, వాటి ఆటను కట్టడానికి కావలసిన పాండిత్యమునంతటిని సంపాదించుకున్నాడు. ఆ పాండిత్యమును చతుర్వేదసారము, సోమనాధ భాష్యము మొదలగు వాటిలో ప్రతిబింబింప చేసినాడు.. కాని వాటి వల్ల శాస్త్రీయముగా వీరశైవ సిద్ధాంతము స్థాపితం అయింది గాని అరిజన సామాన్యములో వ్యాపించవలెనన్న కేవలం పండితులును, విద్వాంసులు పనికిరారు. వీరశైవ మతము ననుష్ఠించి, ఆచరణలోపెట్టి, లోకమునకు లక్ష్యప్రాయుడై ఉన్న వాడు కావలెను. తన వలె ఇతరులును అనుష్టింపవలెను అనుబుద్ధిని కలుగ చేయవలెను. వారి ఉత్సాహమే కాక, ఆవేశము కూడ కావలెను. ఆవేశం పుట్టించుటకు తాను ఆవేశపరుడు కావలెను. జనంలో ఆవేశం పుట్టించుటకు దేశీయభాషలో దేశీయచ్ఛందస్సులో దేశీయరీతినికవిత్వంలో చెప్పుటకంటె మరొకమార్గము లేదను రహస్యం తెలిసికొని ఉండవలెను. ఈ గుణములన్ని సోమనాధునిలో పరిపూర్ణముగా నున్నవి. అతని పాండిత్యం నిరుపమానమైంది. పండితారాధ్య చరిత్రలో ఇది స్పష్టపడుతుంది.

సోమనాథుడు పరమ వీరశైవుడు. భవులంటే ఈయనకు సరిపడదు. అనుభవసారంలో ఇది స్పష్టంగా దృగ్గోచరం అవుతుంది. భవులయిన బ్రాహ్మణులను సోమ నాథుడు తిట్టినాడు. ఈ నింద పండితారాధ్యుని నోటినుండి వెలువడినా తిట్లన్నియు సోమనాథునివే. బ్రాహ్మణులను తాటిమాలలు, పచ్చిమాలలు అన్నాడు. బ్రాహ్మణులను కర్మచండాలురని పలికినాడు.

వీరశైవములో "జంగముడు" ఉత్తమోత్తముడు. అతనికిని లింగమునకును భేదములేదు. లింగశరీరమే జంగమశరీరము. లింగప్రాణమే జంగమప్రాణము. జంగమమూర్తి, లింగమూర్తి అని అర్చించుట ఉత్తమం. అతడు గురుమూర్తి అని అర్చించుట మధ్యమము. అతడు శివశాసనధారుడని అర్చించడం తుదికక్ష్య. ఇందులో పంచాచారము, అష్టావరణము అనునవి పేర్కొనదగినవి. ఈ సంప్రదాయములు సామాజిక ఉద్ధరణమునకు సంబంధించిన కార్యకలాప నిర్వహణకు ఆధారములైనవి. సంఘమునందు స్త్రీలకు ఒక ప్రతిపత్తిని కలిగించుట, వర్ణాశ్రమ ధర్మములను, కులభేదములను నిర్మూలించుట, అస్పృశ్యతా నివారణము అనువానితోబాటు కాయ కష్టము చేయుటయందు గౌరవభావాన్ని కలిగించుట సామాజిక జీవనమునందు, వ్యక్తిగత జీవనమునందు నిరాండబరత్వము, ఈ సంఘ ఉద్ధరణమునందు, సంఘ నిర్మాణమునందు ప్రధానమైన విశేషములుగా చెప్పవలసి ఉన్నది. నిజమునకు సంస్కార రూపమైన ఈ విశేషములే సంఘమునందు ఒక విధమైన

జాగృతిని కలిగించి వీరశైవమతవ్యాప్తికి కారణమైన ఆ మతమును వ్యక్తుల నుంచి సమాజము వరకు విస్తృతిని కలిగించినవి.

పాల్కురికి సోమనాథుడు తన సాహిత్యం ద్వారా వ్యక్తులలోను, సమాజంలోను వీరశైవ మతప్రాతిపదికగా ఒక సమిష్టి భావనను తెచ్చి వైతాళికుడు అయినాడు. ఆయన సాహిత్యంలో అవలంబించిన రీతుల ద్వారా ఆయన కాలంలో యుగకర్త అయినాడు. వీరశైవమతానికి ధ్వజస్తంభము లాగా నిలిచినాడు. శివకవులలో ఆద్యుడైనాడు.

**ఉపయుక్త గ్రంథాలు :-**


1. అనుభవసారము
2. పండితారాధ్య చరిత్ర
3. బసవపురాణము
4. పాల్కురికి సోమనాథుని కృతులు - పరిశీలన - వే. నరసింహారెడ్డి
5. Saivisim - Telugu University, Hyd.)
6. తెలుగు సాహిత్యం - మరోచూపు - ఆంధ్రసారస్వతపరిషత్తు, హైద్రాబాద్
7. తెలుగు సాహిత్యము - వీరశైవమతప్రభావము - డా॥ వి. రత్నమోహిని
8. పాల్కురికి సోమనాథుడు - యువభారతి


( 2-3-95నాడు పాలకుర్తిలో సోమన పీఠమునందు ప్రసంగించిన వ్రాసము)

# 4. ప్రాచీన కవుల భక్తికవితాధోరణి

భక్తిని పరమార్థము వైపు మళ్ళించేదిగా భావించి అనాది కాలంనుండి దేవుడిని కొలవడం రకరకాలుగా సంప్రదాయములో నిలిచి ఉంది. ఈ భక్తిని మనం ఆదికావ్యాలలో నుండి పరిశీలించవచ్చును. మనుషులను నీతివంతులుగ, ధర్మమార్గప్రవర్తకులుగ, మోక్షగాములుగ తీర్చిదిద్దుటకు జ్ఞానము అవసరము. ఇట్టి జ్ఞానమును పొనకందించుటకు, మానవులలో భక్తిభావనను ప్రోదికొల్పి, మోక్షమువైపు మరలించుటకు వ్యాస మహర్షి నుండి ప్రయత్నించుచునే ఉన్నారు.

మహాభారతంలో నన్నయ కూడా భక్తిభావములను చెప్పుటకు ప్రయత్నం చేసినాడు. వేదవ్యాసుడు కూడా మహాభారతమును వేదసంబంధములైన, ధర్మసంబంధములైన వివాదములకు భారతమే ప్రమాణమని చెప్పబడినది.

"ధర్మచార్థేచ కామేచమోక్షేచ భరతర్షభ
యది హాస్తితరన్యత్ర యెన్నే హాస్తినకుత్యచిత్" అని - - - అంతేకాకుండా
"నారాయణం నమస్కృత్యనరంచైవ నరోత్తమమ్
దేవం సరస్వతాం వ్యాసం తతో జయముదీరయేత్" అని అన్నాడు

నన్నయ కూడా తన అనువాదములో శ్రీకృష్ణుడు పూజితుడు, ఆయన ముల్లోకాలకు అధిపతి, ఆయనను పూజిస్తే ముల్లోకాలు తృప్తిపడగలవని చెప్పుతాడు. ఈ మాటలు భారతములో అగ్రజుడైనవాడు, పూజితుడైనటువంటి భీష్మాచార్యుని ద్వారా చెప్పిస్తాడు.

"స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుడున్
భూతలేశుడు సంయుజుండును బూజనీయులు వీరిలో
బ్రీతినెవ్వడు సద్గుణంబుల బెద్ద యట్టిమహాత్ము వి
ఖ్యాతు బూజితుఁ జేయుమొక్కని గౌరవాన్వయవర్ధనా" (సభా - 2- 4)

తిక్కన కాలములో ఈ భక్తి భావన ఆనాటి సాంఘిక సామాజికత ననుసరించి మారింది అనుటకు, తిక్కన ప్రవేశపెట్టిన హరిహరాద్వైతమును మనం చెప్పుకొనవచ్చును. ఈయన దానిని ఆశ్వాసాంత్యములలో "మా మేకం శరణం వ్రజ" అన్నట్టుగా ఇందులో వ్యక్తపరిచారు.

ఎఱ్ఱనామాత్యుడు నృసింహపురాణము చెప్పినా, హరివంశమును చెప్పినా, భారతము శేషమును పూరించినా, ఆయన శివకేశవాద్వైతము సాధించిన సమరస బుద్ధి కుశాగ్రుడు. ఆశ్వాసాంతములో అందుకే ఆయన ఇలా చెప్పుకొనినాడు.

"ఈ త్రయిరాప్రబంధపరమేశ్వరుడై వివరించె శబ్ద వై
చిత్రినరణ్యపర్వమున శేషము శ్రీనరసింహరామ చా
రిత్రములున్ బుధవ్రత గరిష్ఠతనెట్టియశం భుదాసుడా
చిత్రకవిత్వ వాగ్విభవజృంభితుఁ గొల్చెర భక్తి యుక్తితోన్

తరువాతి కాలంలో భక్తిస్వరూపం మారుతూవచ్చినప్పుడు సోమనుడి కాలం వచ్చేసరికి అది వీరశైవముగాను, వైష్ణవంపైన తిరుగుబాటుమొదలు అయింది. సోమన తన పండితారాధ్య చరిత్రలో భక్తి ప్రార్థన ఇలా ఉంది.

"కమనీయసకల నిష్కల తత్త్వమయుల
బ్రమథులఁ ద్రిభువన ప్రమథులఁ దలచి
మత పురాతనభక్త నూతన భక్త
తితవిలింగంబ కా వీక్షించి కొలచి
యారూఢ ముగ మల్లికార్జున పండితా
రాధ్యుల చరిత్ర మర్థివర్ధింతుఁ-!          (పండితారాధ్య చరిత్ర)

....................

కరమొప్పు దక్షిణకైలాసమనఁగఁ
జను సర్వపర్వత సార్వభౌమాఢ్య
తను చేర్చుశ్రీగిరీంద్రంబు దా నదియు
ననుపమప్రమథ గణాస్థానవేది,
మునుల ముముక్షుల మూలబండరువు
బాగొందఁ బర్వతు పండినతనము
ప్రోగైనమూర్తి, శంభుని యశోరాశి
గరువుగట్టిన మహాకాశంబు, శ్రుతుల
శిరము, ఘనీభవించిన పరంజ్యోతి,
దఱగని పుణ్యంబు, తవనిధినుతుల
గుఱి, సదాశివునియంకార, మత్రిజాత
వలపలిబరి, భక్తవరుల యిద్వేల్పు
సలనంబులేని విజ్ఞానాబ్ధికడలు

ధృతి ముద్దగించిన దివ్యామృతంబు
లతగరిగొన్న మూలస్తంభ మనఁగ
జెలువారి నట్టి యా శ్రీశైల శిఖర
కలిత త్రిలోక విఖ్యాతయశఃప్ర
పూర్తియౌ శ్రీ స్వయంభూలింగ చక్ర
వర్తి, యసమకీర్తి, వారితనతజ
నార్తి, శ్రీమన్మల్లికార్జున లింగ
మూర్తి యొప్పారు సమున్నత మహిమ

పాలకుర్తి సోమనాథుడు శివతత్త్వ ప్రచారమునకు కంకణంకట్టుకొని ఇంకా బసవపురాణము, వృషాధిపశతకములను కూడా రచించినాడు. శివసంబంధమైన భక్త్యావేశాన్ని వెల్లడిచేస్తూ, సృష్టిస్థితి లయల విషయంలో పరమేశ్వరత్వాన్ని శివునికి ఆపాదించే వారి అభిమతమే శైవమతమైంది. శైవంలో కూడా అనేక శాఖలున్నాయి. పాశుపతం, కాపాలికం అనేవి శైవంలోని భేదాలు. ఆచార వ్యవహారాల్లోనూ, ధర్మాచరణంలోనూ వీళ్ళ మధ్యభేదం కనిపిస్తుంది. ఈ శాఖలన్నింటికీ సమాన ధర్మం శివుడే పరముడనటం. ఇందులో పాశుపతం చాలా ప్రాచీనమైంది. దైవభక్తిలో వీరశైవభక్తి మనకు కనిపిస్తుంది[1]. ఇది మూడువిధములు

1. వీరభక్తి - విజ్ఞానమతులు కూడా శివాచారమొనర్చినదను కారణమున భార్య చేతులు ఛేదించుట, తండ్రికాళ్ళు తెగవేయుట, తన తలయే నఱుకుకొనుట మొ॥గునవి.
2. ముగ్ధభక్తి - పసిబిడ్డలు, పసిబిడ్డలను బోలినమాయకులొనర్చు శివ నివేదనము, గొడగూచి సమర్పించిన పాలు శివుడారగించుట రుద్రపశుపతిని తన తొడపై గూర్చుండచేయుట మొ॥గునవి.
3. ముఢభక్తి - విద్యాగంధములేని కన్నడు విచక్షణారహితముగా తన కన్నులూడ బెరికి శివుని కనుగుంటలలో సమర్పప్రయత్నించుట కిట్టి భక్తియే కారణము.

పాల్కురికి సోమనాధుడు భగవంతునికి, భక్తునికి మధ్యఉండే సన్నిహితతత్వాన్ని ఇల చెప్పుతాడు.

---

1) పాల్కురికి సోమనాధుని రచనలలో వీరశైవమత లక్షణములు - జి. చెన్నారెడ్డి (సాహిత్యపు ప్రభోదము) 1972

నా యెడయడ, నా విభుడ
నా హృదయేశ్వర, నా మనోరమా
నాయిలవేల్పు, నా వరుడ
నా గురులింగమ, నాదుజంగమా
నాయధినారా, నావరుడ
నన్ను గృపామతిఁ బ్రోవు మయ్య దే
వా యమబృంద వంద్య బసవా!ః బసవా ! బసవా ! వృషాధిపా !"

(వృషాధిపశతకము 104వ పద్యం) అని ప్రస్తుతించారు.

మతమునందు వలెనే, సాహిత్యమునందు శివకవులుకొన్ని సంప్రదాయములను పాటించిరి. సోమనాథుడు ద్విపద రచన చేయుట ఇట్టి సంప్రదాయానుసరణమే బసవేశ్వరుడు చేసిన వచన సంప్రదాయము శైవమును పాటించిన వారికి మార్గదర్శకమునైనది. రామానుజాచార్యుల సంస్కృత గద్యములు వైష్ణవులకు అనుసరణీయములైనట్లుగనే, బసవేశ్వరుని కన్నడ వచనములు శైవులకు అనుగమ్యములైనవి. ఈ విధముగా శైవ, వైష్ణవమతములు తెలుగు వచన రచనమునకు దోహదములైనవి.

భక్తి ప్రధానములై స్తోత్రరూపములుగా నుండి, సంకీర్తనాత్మకముగా నున్న వచనములలో కాలక్రమమునను సరించి కృష్ణమాచార్యులు రచించిన "సింహగిరి వచనములు" మొదటివి. ఈ వచనములే కృష్ణమాచార్య సంకీర్తనములనియు, కృష్ణమాచార్య పదములనియు వ్యవహారమును బొందినవి. తాళ్ళపాక చినతిరుమలాచార్యుడు (క్రీ.శ. 16వ శతాబ్దము) తన సంకీర్తన లక్షణమను గ్రంథములో ఇలా పేర్కొన్నారు.

" ............ చూర్ణాఖ్యపదం బెట్టిదంటే ని
ధరకృష్ణాచార్యాదిక
పరికల్పిత పదము తాళ బంధచ్ఛందో
విచూహితమై చూర్ణాఖ్యన్
బరగునది నిరుక్త నామ భాసితమగుచున్

మరియు దచ్చూర్ణం బెట్టిదనిన
ఛందోగణముల నియతిం
బొందక తాళప్రమాణమున గడుఁజెలువై
కొందరిచే దచ్చూర్ణం
బందముగా రాళగంధియన్నఁబొగడొందున్".

ఇవి వచనములైనను వాటిని "కృష్ణాచార్యాదిక పరికల్పిత పదము"లని చిన్నన్న పేర్కొనియుండుటచే, వానికి పదనామము వ్యవహారమున సుండెననియే చెప్పవలెను.

కృష్ణమాచార్యులు రచించిన యీ వచనములందు, వైష్ణవులయొక్కయు, విష్ణుభక్తి యొక్కయు ప్రాశస్త్యమును దెలుపు కొన్ని గాథలువర్ణింపబడిఉన్నవి. వీనిలో అచ్చటచ్చట అద్భుతసంఘటనలు కూడా ఉన్నవి. అయినను వైష్ణవులలో పరంపరగా వచ్చు కథలగుట చేత కాబోలు, కృష్ణమాచార్యులు వానిని గ్రహించెను.

"దేవా, శ్రీవైష్ణవులే బ్రాహ్మణులు, శ్రీవైష్ణవులే పరమ సాధువులు శ్రీవైష్ణవులే శోభిత శుభదాయకులు, వారి (మీ) కుల గోత్రం బెన్ననేమిటికి ? మీ దాస్యంబె కారణంబు ? మీ జాస్పందె వివాహంబు ? శ్రీ కృష్ణకు వ్వారుస్వామీ, సింహగిరినరహరీ, నమోనమోదయానిధీ ?' - 3వ వచనము

"దేవా, విష్ణుభక్తిలేని విద్వాంసునికంటె హరికీర్తనము సేయునతఁడె కులజుండు. సంధ్యా (వందనాది) నిత్యకర్మానుష్ఠానంబులు తప్పక నడిపిన నేమి ? సకల ధర్మంబులు సేసిన నేమి ? మాసింహగిరి నరహరిదాసులకు దాసులైనంగాని లేదు గతి ? స్వామీ ! సింహగిరి నరహరీ, నమోనమోదయానిధీ ! (11వ వచనము)

శ్రీరామానుజుల వారు ప్రతిపాదించి ప్రచారము చేసిన విష్ణుభక్తి, వర్ణాశ్రమ ధర్మరాహిత్యము, భాగవతకైంకర్యము, ఆచార్యసేవానిరతి, యను వైష్ణవమత సూత్రములనే కృష్ణమాచార్య పునశ్చరణ చేసియున్నాడు.

తరువాతి కాలంలో శ్రీనాధుడు తన కావ్యాలలో కాశీఖండం, నైషధంలలోకూడా తద్భావానుగుణముగా భక్తిని ప్రవచించినాడు. నైషధంలో ఆయన దశావతార వర్ణన కూడా కావించాడు.

భాగవతకర్త పోతనామాత్యుడి రచనలో ఈ భక్తికి శిఖరాగ్రత చేకూరింది. ఇందులో అనేక రకాలైన భక్త జీవుల చరిత్రలు ప్రస్తావింపబడినవి. ఆయా ప్రాణులు భగవంతుణ్ణి చేరుకోవటం కోసం ఎదుర్కొన్న కష్టాలు, అవి పొందిన ధన్యత వివరింపబడింది. భాగవతంలో గజేంద్రమోక్షం, ప్రహ్లాదుని చరిత్రలు భగవన్నామ సంకీర్తన ప్రాధాన్యాన్నిచ్చేవిగాను, గోపికల విషయంలో నాయికానాయకుల పక్షమున వ్యక్తంకాబడిన మధురభక్తి ప్రస్తావించటం జరిగింది. భాగవత భక్తుల చరిత్రలన్నీ నవవిధభక్తి మార్గాల్ని అనుసరించి చెప్పబడినవే.

"తమ హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱకయున్ సంకీర్తనలే చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచుదలఁతు నే సత్యంబు దైత్యోత్తమా !"

అంటూ పేర్కొనినాడు.

నారద మహర్షికూడా భక్తి సూత్రాల్లో ఏకాదశ సూత్రాలను పేర్కొనినాడు, గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, పద్మనాసక్తి, స్మరణాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయాసక్తి, పరమ విరహాసక్తి అనేవి పదకొండు భక్తిమార్గాలు

"ఒక సూర్యుండు సమస్త జీవులకు దానొక్కొక్కడై తోచు పో
లికనేదేవుడు సర్వకాలము మహాలీలన్ విజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోరుహముల నానావిధానూన రూ
పకుడై యొప్పుచునుండు నట్టి హరినే బ్రార్థింతు శుద్ధులడనై" (భా.గ. 1-224)

కమలాక్షునర్చించు కరములు కరములు శ్రీనాథువర్ణించు జిహ్వాజిహ్వ
సురరక్షకునిజూచుచూడ్కులు, చూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదముల పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి
దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుడు గురుడు
తండ్రి ! హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి"
అని భగవంతుని గూర్చిన నిరంతర చింతనను పేర్కొనినాడు.

లీలాశుకులు కూడా శ్రీకృష్ణకర్ణామృతములో శైశవలీల కృష్ణునే ప్రేమించినాడు. ఆయన కృష్ణునే వర్ణించినాడు. తాళ్ళపాక కవులు భగవంతుని ఇలా కీర్తించినారు.

"అణురేణు పరిపూర్ణుడైన శ్రీవల్లభుని
ప్రణుతించువారువో బ్రాహ్మణులు
కొంచెమును ఘనముగను గాననేల హరిదలచు
పంచ మహాపాతకుడె బ్రాహ్మణోత్తముడు

వేదములు చదివియును విముఖుడై హరికథల
నాదరించిన సోమయాజికంటె
ఏదియునులేని కులహీనుడైనను విష్ణు
పాదసేవకుడువో బ్రాహ్మణోత్తముడు
పరమగువేదాంత పఠనదారకియుసదా
హరిదలచలేని సన్యాసికంటె
మరిగిపసురము దినెడి మాలయైననువాడె
పరమాత్ముగొలిచినను బ్రాహ్మణోత్తముడు॥

తాళ్లపాక కవులు గానంచేసిన సంకీర్తనలను పాటల రూపంలో తెలుగు ప్రజానీకానికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను తిరుమల తిరుపతి దేవస్థానం దాదాపు 32 వేలపై చిలుకు వచ్చినవి -

అల్లసానిపెద్దన తన మనుచరిత్రలో స్వారోచిత తపః ఫలముగా సాక్షాత్కరించిన నారాయణుని వర్ణించినాడిలా -

"నీలమేఘమడాలు డీలుసేయగజాలు
మెఱుగుఁజామనచాయమేనితోడ" అని

శ్రీకృష్ణదేవరాయలు ఆస్థానకవులు అందరూ కావ్యములను వ్రాసినా, వారి కావ్యములలో భక్తి భావనా పరంపర జాలువారుతూ వచ్చింది. స్వయంగా కవి అయిన ప్రభువు తన కృతి ఆముక్తమాల్యదలో శ్రీహరిని కీర్తించినాడు.

ఈ కాలంలోనే తెనాలి రామకృష్ణుని "పాండురంగమహత్యము" పింగళి సూరన కళాపూర్ణోదయం", ధూర్జటి శ్రీ కాళహస్తి మహాత్మ్యం, ఘటికాచల మహాత్మ్యంలు శైవ, వైష్ణవభక్తి భావాలను ప్రతిబింబించడమే కాకుండా, ఈ గ్రంథాలలో ఆయాస్థలాలలోను, తీర్థాల్లోను వెలసిన భగవంతుని మహిమల్ని ఆయా కవులు వ్యక్తం చేసి తమ భక్తిని ప్రదర్శించుకున్నారు.

అన్నమయ్య పదకీర్తనల తర్వాత కీర్తనా సాహిత్యంతో మనముందు భగవత్ స్వరూపాన్ని దర్శింపచేసిన వారిలో అగ్రగణ్యులు భక్తకవులు క్షేత్రయ్య, త్యాగయ్యలు.

పలువిధాలైన నాయికలదృష్టితో క్షేత్రయ్య మువ్వగోపాలుని తన జీవితేశునిగా సంభావిస్తూ "మువ్వగోపాలా" అనే ముద్రతోను, కంచివరదా అనే ముద్రతోను ఎన్నో పదాల్ని పాడుకున్నాడు. ఈ పదాలన్ని రాగతాళయుక్తంగా సంతరించబడి అభినయించడానికి అనుకూలంగా వున్నటువంటివి. మువ్వగోపాలుని ముద్దుసఖుడుగా భావించుకొని తన్నొక స్త్రీగా సంభావించుకున్న క్షేత్రయ్య -

"మువ్వగోపాలుని ముద్దుసఖుడని - మ్రొక్కి వేడుకొందునే !
జవ్వనమెల్లను వాని పాలుచేసి - సంతోషించుకుందునే !"

అని అభిలషించాడు. ఆ అభిలాషలో భగవంతునితో కలిసిపోవడానికై తాపత్రయంతో

"ఏమిసేతురా ప్రాణేశా ! నే - నెటువలె తాళుదురా
ఏమోకొని నిన్నెడ బాసినప్పుడే యీ మేన ప్రాణములే
మిటికని తోచే ............... " అని బాధపడ్డాడు.

త్యాగరాజు తన కృతుల్లో భగవంతుని అనంతదివ్యత్వాల్ని, మహిమానుభావాల్ని, విలాసాల్ని చాటి చెప్పే, భక్తిమాధురులొలికించే భావాల్ని వెలువరించాడు. ఉపనిషత్తుల్లో ప్రతిపాదితమైన బ్రహ్మస్వరూపాన్ని త్యాగయ్య నాదబ్రహ్మగా ఉపసించి తరించాడు. త్యాగరాజు భక్తుడుగా తాను అనుభవించిన ఆనంద పారవశ్యాన్ని, మానసిక వేదనకు, పశ్చాత్తాపాన్ని తన కృతుల్లో భగవంతునికి నేరుగా నివేదించుకున్నాడు. ఆయన మొరను ఆలకించిన భగవంతుడు త్యాగయ్యను తనలో విలీనం చేసుకున్నాడు.

రామదాసు, సారంగపాణి పదాలు కూడా భక్తి భావోన్ముఖంగానే వెలువడ్డాయి. సారంగపాణి విషయంలో కూడా మధురభక్తి స్రవించి తేనెవాకలై ప్రవహించింది. సారంగపాణి కేవలం శృంగారానికే కాకుండా భగవన్నామ సంకీర్తనకు, భక్త్యావేశానికి ప్రాతినిధ్యం ఇచ్చాడు.

తెలుగులో భక్తి కవిత్వంలో పదకవిత్వం తరువాత పేర్కొనదగింది శతక కవిత్వం. అనేక రకాలైన శతకాలు తెలుగులో ఆవిర్భవించి శాఖోపశాఖలుగా విస్తరిల్లాయి. శతక రచన సామాన్యంగా కవులు కవిత్వ అభ్యాసం కొరకు చేసే తొలి ప్రయత్నం. కవులు ఆనవాయితీగా ఈ శతక రచనల్ని భగవంతుని పరంగా స్తుతి రూపంలో కావించారు. అందువల్లే శతకాల్లో ప్రధానంగా భక్తిభావమే పాదులుదన్నుకొంది.

తెలుగులో శివతత్త్వసారం, సర్వేశ్వర శతకం, వృషాధిపశతకం, కాళహస్తీశ్వర శతకం మొదలైన శైవభక్తి శతకాలు: నారాయణ శతకం, వీరనారాయణ శతకం, హరిముకుంద శతకం వంటి వైష్ణవ భక్తి శతకాలు వచ్చాయి.

తెలుగులో భక్తిపూరితమైన రచనలుగా కేవలం పురాణాలు, ఇతిహాసాలు, మహాత్మ్య గ్రంథాలు, పదకవితలు, శతక రచనలే కాకుండా, స్తుతిపూర్వకమైన స్తోత్రరచనలు, దండకాలు కూడా వెలిశాయి. ఇవీ భక్తి భావసమ్మిశ్రితాలే, ఇటువంటి వాటిల్లో మహాలక్ష్మి దండకం, ఆంజనేయదండకం, నృసింహదండకం, లక్ష్మీస్తవం, సరస్వతీ స్తవం, విఘ్నేశ్వరస్తుతి మొదలైనవి పేర్కొనదగినవిగా కనిపిస్తాయి.

వీటితోపాటుగా శిష్టులైన దేశి కవితా పద్ధతిలో కూడా తెలుగులో భక్తి భావాలు ప్రదర్శితాలయ్యాయి. శిషులు, లైనకవుల్లాగే జానపదుల నోళ్ళలో భగవంతుని చింతనతో మగ్నమైన గేయాలు, పాటలు భక్తిని ప్రకటిస్తూ వెలిశాయి. అటువంటి వాటిల్లో జానపదుల భజన పాటలు, కోలాటం పాటలు, లాలిపాటలు, జోలపాటలు పేర్కొనదగినవి.

"శివశివమూర్తివి గణనాథా
నీవు శివుని కుమారుడవె గణనాథా"

"లాలనుచు పాడరమ్మ ఈ బిడ్డలక్ష్మీవిలాసుడమ్మ
పాదమున చక్రమమ్మ ఈ బిడ్డ వేదాంత వేద్యుడమ్మ
వేణు నాదంబుతోను ఈ బిడ్డ వేదములు పాడునమ్మ"

అంటూ శైవ, వైష్ణవ భక్తిని పాడే లాలిపాటలు జానపదులలో ఉన్నాయి.

పురాణాలు, ఇతి హాసాలు, మహాత్మ్యగ్రంథాలు, పదకవితలు, శతకాలు, దండకాలు, జానపదుల పాటలు ప్రాచీనకాలం నుంచి మానవ హృదయాల్లో చోటుచేసుకొన్న భక్తి భావాల్ని ప్రదర్శిస్తూ, భావసౌందర్యానికి ప్రతీకగా నిలిచినది. భక్తి అనేది కేవలం నాగరక మానవమాత్రులకే పరిమితమైందికాదు. ఇందులో ఆత్మసమర్పణం భక్తికి పరాకాష్ఠ.

# 5. భావకవిత్వంలో కృష్ణసౌందర్యము

భావకవిత్వ మనగానే సౌందర్యం, ప్రేమ ముఖ్యంగా విశ్వమానవ ప్రేమ తలపుకు వస్తాయి. భావకవిత్వంలో ప్రకృతి, ప్రణయం, ఆత్మ సౌందర్యం, ప్రభోదం, ప్రాధాన్యం వహిస్తాయి. "కవి యొక్క ఒక అవిస్పష్టవాంఛాంకురము, ఒక అంతర్నిగూఢతాపము, ఒక చిన్న కావ్యములో ఊదబడినచో "అది భావకవిత్వము"[1] అని విశ్వనాథ సత్యనారాయణగారు నిర్వచించినారు. ఇది ఇంగ్లీషు విమర్శకులు లిరికల్ పొయెట్రీకి చేసిన నిర్వచనముతో తులదూగుచున్నది. "The lyric has the function of revealing in terms of pure art, the secret of the inner life, its hopes, its tantastic joys, its sorrows, its delirium"[1]

భావకవిత్వములో ప్రణయ కవిత్వం, దేశభక్తి, ప్రకృతి, సంఘసంస్కరణ, స్మృతిగీతాలతో పాటుగా భక్తి కవిత్వం కూడా ప్రాధాన్యతను సంతరించుకొనినది. ఈ ప్రక్రియలను కొంచెం వ్యత్యాసంతో స్వీకరించిన వారే భావకవులు. భావకవులలో కృష్ణ శబ్దము వచ్చేసరికి పరవశత్వంతో వారు తాదాత్మ్యతతో సఖులై విహరించారు అని చెప్పవచ్చును.

రాయప్రోలు, విశ్వనాథ, వెంకటపార్వతీశ్వర కవులు, బసవరాజు అప్పారావు, కృష్ణశాస్త్రి, దువ్వూరి, వేదుల, నండూరి, పింగళి, కాటూరి, దాశరథి, జాషువా, తుమ్మల, సి.నా.రె. మొ॥గు వారు భావ కవితా విహాయసంలో తమ కలాన్ని పదును పెట్టి రాధాతత్వమును కృష్ణశబ్దంతో రంగరించి పోసినారు.

రాయప్రోలు సుబ్బారావు గారు ఆస్తికత్వము, భావకవిత్వము లక్షణములలో ఒకటని అంగీకరించినారు. "భావకవులలో అధికులు మధుర భక్తి మార్గమునే ఆశ్రయించిరి. కొందరీ మార్గములోనే అహంకార త్యాగమును ఆత్మనిందను ప్రదర్శించిరి. ఇది మధుర భక్తికన్న భిన్నమైన మార్గము. వెంకటపార్వతీశ్వరకవుల "ఏకాంతసేవ" మధురభక్తికి చక్కని నిదర్శనము. వారి భావసంకీర్తనలో దాస్యభక్తి, వాత్సల్యభక్తి, నిర్గుణభక్తి, ఆర్తభక్తిమున్నగు అనేక లక్షణములున్నవి. వీటితోపాటు ఈషణత్రయనిరసనము, పరిదేవనము, శరణాగతి, నామగుణసంకీర్తనం, పరతత్త్వగవేషణము కూడ కలవు. ఈ శాఖలతో పాటు తత్త్వ ప్రధానమైన కవిత్వము కూడా వెలువడినది. ఈ శాఖలన్నిటిపై ప్రాయికముగా మన భారతీయ సంప్రదాయ ప్రభావమే ఉన్నది.

రాయప్రోలుగారి ``జడకుచ్చులు``లో ఈ భక్తితత్వం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ``జన్మాష్టమి`` ఖండికలో శ్రీకృష్ణజయంతిని ఇతివృత్తంగా స్వీకరించారు. ఇందులో శ్రీకృష్ణుని ప్రత్యేకంగా ప్రస్తుతించలేదు. కేవలం ప్రకృతినే వర్ణించినారు. శ్రీకృష్ణజనన సమయంలో ప్రకృతి పొందిన పులకింతను ప్రధానం చేసి చెప్పారు. ``జన్మాష్టమి'' అన్న పేరునుబట్టి శ్రీకృష్ణుని ప్రస్తావనేకాని ఖండికలో ఆదేవుని ప్రసక్తిలేదు.

``రూపనవనీతమ్'' శ్రీకృష్ణుని గూర్చి ఇందులో ప్రవచిస్తారు. విశుద్ధప్రేమ చైతన్యం మరుగునపడడంవల్ల సమాజం అల్లకల్లోలం అయినట్లూ తిరిగి ఆప్రేమ స్వరూపావిష్కరణ సమాజంలో ప్రేమస్థిరత్వాన్ని కలిగించినట్లు ధ్వనించడానికి శ్రీకృష్ణుని ప్రస్తావన చేసినట్లు తోస్తుంది. శ్రీకృష్ణుని పవిత్రప్రేమకు ప్రతి రూపంగా గ్రహించి ఆ ప్రేమ మూర్తి అంతరార్థాన్ని, పునర్దర్శనాన్ని సూచించారనిపిస్తుంది. ఈ రచన ఒక లక్ష్యంతో సిద్ధాంత ప్రయోజన దృష్ట్యా శ్రీకృష్ణుని ప్రస్తావించినట్లు భావించవచ్చు. ``లాలి'' అన్న ఖండికలో (మిశ్రమంజరి) శ్రీకృష్ణుని తులసీ దళహారిగా, బృందావన విహారిగా, గోపీవస్త్రాపహారునిగా, రాధా ప్రియునిగా వర్ణించారు. ఇది సంప్రదాయ సిద్ధమయిన శ్రీకృష్ణుని స్వరూప స్వభావచిత్రణను అనుసరించి ఉంది.

``ప్రవాస రాధిక'', ``రాధపిలుపు'' వంటి ఖండికలు రాధ ప్రేమకు ప్రాధాన్యం ఇచ్చారు. రాధ ప్రియునికై నిరీక్షించడం ఈ రచనలలో ప్రధానం అయినా ఆమె కృష్ణుని వెదికేతీరులో భక్తిభావం తొంగిచూస్తుంది. మధురభక్తి ప్రధానంగా ఈ రచనలలో కనబడుతుంది.

``వైష్ణవగీతాలలోని హృదయ పక్వత మెదడుకు పట్టించుకున్నాడు. కళా సంపత్తి ఎక్కువ. కవిత్వంకోసం బ్రతుకు తాడు. రుచిగలవాడు'' అని ముద్దు కృష్ణగారు శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రిగారి శక్తిని చక్కగా పరిచయం చేసినాడు. కృష్ణశాస్త్రిగారి కృతులు గుహుడు, కృష్ణాష్టమి, శ్రీఆండాళ్ళు, శర్మిష్ఠ, యమునావిహారి, కృష్ణపక్షం, మహతి మొదలగు వాటిని చెప్పుకొనవచ్చును.

``మ్రోయింపకోయ్ మురళి మ్రోయింపకోయ్
తీయతేనియ బరువుమోయలేదీబ్రతుకు''

అనే ఆ పిల్లన గ్రోవి పిలుపులోనూ, ``కాలుచల్లదనాలు'' 'కనలు తీయందనాలు'

ఏదో "సౌఖ్యజ్వాల" యున్నవని కవి చకితుడు అయినాడు. మురళీగాన మాధుర్యము వలన తనకు కలిగిన పారవశ్యమును తట్టుకొనలేని అత్యంత సుకుమార హృదయము యొక్క విచిత్రమైన అవస్థ ఇట్లు ప్రకటింపబడినది. అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్య వంటి వాగ్గేయకారులకు సరియైన వారసుడు కృష్ణశాస్త్రి. "ప్రేయసి సోయగమ్మునకు లేదు, శరీరము లేదు, మేను నా తీయని ప్రేమకేని, కలదె యెడబాటిక మాకు ?" కృష్ణశాస్త్రి కవిత్వములో రాధాకృష్ణుల ప్రేయసి తత్త్వము నింగికెగసి దుమికినది.

వేదుల సత్యనారాయణశాస్త్రి గారి కవనములో దీపావళినందు విరహిణియైన 'రాధ' నర్తించినది. అంతే కాకుండా మధురభక్తికి ఆటగొమ్మయై వెలుగొందినది. శ్రీకృష్ణుని వేణుగానమునకు అత్యంత ప్రాధాన్యమున్నది. కృష్ణభక్తి తత్త్వమును ప్రదర్శించిన కవులెవరూ కూడా వేణుగానమును వర్ణించక విడువలేదు.

ఏదియింకొక్క మారూదరా నీ మురళి
నాలోనె నేడు బృందావనము విరిసినది
నాలోన నేడెయమునాతటిని మెరసినది
ఏ వసంతా నిలమొ
ఏ గాన కలకలమొ
ఈ నా యడద నిండా నిండి పోయినది.
ఓ దివ్యగాయకా
ఓ ప్రాణనాయకా
ఏది యింకొక్క మారూదరా నీమురళి

"రవికరోద్దీప్తహిమశీకరమ్ము వోలె
రమ్యపింఛముచిత్రవర్ణములఁదొలుక
శిరము నూపుచుమోవిపై మురళినూది
యేది మరియొక మారు వాయింపుమోయి !

"ఈనవవేణుదండమిటులేటికిఁజెక్కెర వేలచిల్లులై
పోనాగిలింతువంచడిలిపోయితి, వ్యర్థపుటూర్పు గాడ్పులన్
గానము గాగ మార్చుటకె గాయని యిప్పుడెనే గ్రహించితి
గాని విశీర్ణ మీ హదయానాళమెటుల్ పలికింతువో ప్రభూ !

ఈ గేయమును వినినప్పుడు "This little flute of a reed throw has carried over hills and dales and last breathed through it melodious enternally new" రవీంద్రుని గీతాంజలి లోని ఖండికనుగుర్తుకు తెచ్చింది.

కరుణశ్రీగారు మోహనవేణుగానమును, రాధప్రేమను, విశ్వమోహన తత్త్వమును ఆయా ఖండికలలో చక్కగా వ్యక్తపరిచారు.

"రాధపై ప్రేమ యధికమో మాధవునకు
మాధవునిపైన రాధ ప్రేమయె ఘనమ్మొ"

ఈ రహస్యమునెఋగలేదెవరుకూడ
ప్రణయమను నిత్యనూత్న దంపతులువారు"

కరుణశ్రీగారు రాధాముఖముననో, తానే రాధగా మారియోకృష్ణుని అర్థించినారు. భావ కవిత్వములో భక్తి తత్త్వమునకు చక్కటి ప్రాధాన్యతను కూర్చడమే కాకుండా రాధాకృష్ణుల మధురభావనకు చక్కటి నాంది వేసినారని చెప్పవచ్చును.

కీ॥ శే॥ చిలుకమఱ్ఱి రామానుజాచార్యులు గారు 'మధురవేదన" ఖండ కావ్యసంపుటిలో తనే రాధగా మారి కృష్ణుని కొలచినారు.

"ఒక్కసోకుననే రాగమూదినావా
మ్రోగుచున్నది మన్మనోమురళికృష్ణ !
కరకదన మంతకంతకు గరిగికరగి
పారుచున్నది నా పదాబ్జములవైపు !! - అంటూ

మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి గారు "బృందావనం" కావ్యంలో బాలకృష్ణుని వేణుగాన మాధుర్యరీధుర్యమైన ఒక రసధుని. కలిమిలేములతో సుఖదుఃఖాలతో, జనన మరణాలతో కూడిన ఈ ఇహలోకపు యాత్ర మాధవపెద్ది వారికి ఒక విచిత్ర స్వప్నంగా భాసించింది. ఆయన -

"వచ్చియొకసారి నా ప్రాణవాయువునను
హృదయవేణువు నూదిపోయెదవె కృష్ణ !
ఆత్మ బృందావనంబు నీయుగమమున
నెదురుచూచుచున్నవోయ్మీమహాత్మ !!"

అని ఆత్మ అనెడి బృందావనంలో హృదయ వేణువును వూదడానికైరమ్మని బాలకృష్ణుని వేడుకుంటాడు భక్తిచిత్తంతో ......

అంతేకాదు మరొక పద్యంలో దేహాన్ని ఒక ప్రయాగగా భావించి త్రివేణీసంగమంలో నుడికారరూపమైన గోపీనంతో కూడి జలక్రీడలాడడానికై రమ్మని కృష్ణుని ఆహ్వానిస్తాడుకవి.

"యమునయేగాక దేహప్రయాగయందు
గంగ యమున సరస్వతియు గూడగలవు, గాన
నా త్రివేణీ జలక్రీడ నాచరించె
నాడికారూపగోపీజనంబు గూడి"

శ్రీబాలాంత్రపురజనీకాంతరావుగారు "స్వైరిణి అన్నారు నన్ను శ్యామసుందరా" అన్న ఖండికలో కృష్ణుని పిలుపునందుకొని రాధ" ప్రణయకుంజధామము" వైపుపరుగెత్తుచు వచ్చుచుండగా వ్రజాభామినులు ఈసునగేలి చేయుదురు. అయినను వానిని లక్ష్యము సేయక రాధ శ్రీకృష్ణుని సన్నిధికిచేరి గోపికలు తనను "స్వైరిణి" అని పరిహసించినారని అతనితో చెప్పుతుంది.

"చల్లగాలిలో యమునాతటిపై
శ్యామసుందరుని మురళి"
....................................

స్వైరిణి అన్నారు నన్ను శ్యామసుందరా !" అన్నప్పుడు శ్రీకృష్ణుడు ఆమెను దగ్గరకు తీసుకొని -

"ఎవ్వరహమ్ముతో నెన్నడుక్రొవ్వి
యుందురో వారిలోనుండదు ప్రేమ
నవ్వితే నవ్వని, నొవ్వకమెదను
నీ ప్రేమ వడిముందు నిలుతురె వారు" అని అంటాడు.

అన్నమయ్య శృంగార భక్తిని, అటు గోదా, గోపికల ప్రేమ భక్తికిని గల ప్రామాణికతను గుర్తించుకొనుటకుతోడ్పడునది నరనారాయణ సంవాదాత్మకమైన గీత. గోదాదేవి పాశురములను, గోపికల గీతలను భగవద్గీతాసారభూతములైన కర్మ జ్ఞాన భక్తి యోగములను, విశ్వరూప సందర్శన యోగమును చక్కని ద్విపదలలో సరళముగ సంతరించిన ఉమగాడు తెలుగులోని భక్తి సాహితికి 'భక్త మంజరి' పేర ఒక చక్కని అలంకృతిని సమర్పించినాడు అన్నమాచార్యుల రచన సామాన్యముగ నర్థమగునదికాదు. తెలుగునుడికారము, సంస్కృత భాషాపాటవము అలవడిననే అందలిభావగాంభీర్యము సాక్షాత్కరించును. అట్టి సంకీర్తనలను కొన్నిటిని ఏరి, వాని భావమును, పరమార్థమును వివరించుచు పాడుకొనుటకు అనువగునట్లు

రాగములను కూడ శాస్త్రీయముగా నిర్దేశించిన డా॥ పి. ఉమగారి కృషి ఎంతో శ్లాఘనీయమైనది.

"శ్రీ కృష్ణ చరితంబు శృంగార కథలు
రాకేందుముఖలెల్లదమియించునెలవు"

ఇది గోపికా గీతలను ప్రస్తావించుమొట్టమొదటి ద్విపద ఒక్క మారుగా సమస్త శృంగార భక్తి సామ్రాజ్యమును కనులముందు నిలుపగల రసవత్తరమైన ఎత్తుగడ.

గోపికల రాసక్రీడ ఎంత్తో రమణీయముగ వర్ణితమైనది

"రమణులు కృష్ణుని రసకేళియందు
కమనీయ క్రీడలనే కలిసిరి నాడు
సౌ తశ్రేణులన్ సాగెను కేళి
లోకమే శృంగారలోలమైనిండె"

సుందరమైన ప్రకృతి కవులకు ప్రేరణ కలిగిస్తున్నన్నాళ్ళూ, ప్రణయ భావనలో నూతన వ్యక్తీకరణ కోసం కవులు ప్రయత్నించినన్నాళ్ళూ, ఈ సృష్టికి మూలమేమి ? పరమాత్మ స్వరూపమేమి ? మానవునికి పరమాత్మకుగల సంబంధమేమి అను జిజ్ఞాస ఉన్నంతకాలము భావకవిత్వంలో భక్తికవిత్వం అందులో కృష్ణ శబ్దం ఉద్భవిస్తుంటూనే ఉంటుంది.

## ఆధారగ్రంథాలు


1. విశ్వనాథ శారద
2. ఏకాంతసేవ - మధురభక్తి - వేంకట పార్వతీశ్వర కవులు
3. రాయప్రోలు సుబ్బారావు గారి "జడకుచ్చులు"
4. కృష్ణపక్షం - కృష్ణశాస్త్రి
5. దీపావళి - వేదుల సత్యనారాయణశాస్త్రి
6. గీతాంజలి - రవీంద్రుడు
7. ఉదయశ్రీ - కరుణశ్రీ
8. మధురవేదన - చిలుకమర్తిరామానుజాచార్యులు
9. బృందావనం - మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి
10. స్వైరిణి అన్నారునన్ను శ్యామసుందరా - రజనీకాంతరావు
11. భక్తమంజరి - డా॥ పి. ఉమ